


ఎక్కువమందిచే పొగడబడి, ఇప్పటి వరకు 70 లక్షల పాఠకులకు పైగా లాభం పొందిన కోర్సు.

**ఆంగ్లంలో అనర్గళంగా మాట్లాడటం నేర్పే సులభమైన, సరళమైన పద్ధతి**

# "రేపిడెక్స్" ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్సు

## రేపిడెక్స్ పద్ధతి:—

నిత్య వ్యవహారంలో ఉపయోగించే ఆంగ్ల భాష ఎ క్రమబద్ధమైన పద్ధతిలో చదువుతూ నేర్చుకునేందుకు, అర్థం చేసుకునేందుకు ఒక సహజమయిన, సులభమైన పద్ధతి...ఎలాగంటే చిన్నపిల్లలు బడికి వెళ్ళకముందే ఇంట్లోనివారి మాటలు విని సంభాషించటం నేర్చుకున్నట్టు అన్నమాట.

## దిగువ పేర్కొన్న యువతీ-యువకులు, స్త్రీ-పురుషుల కోసమై

* అండర్ గ్రాడుయేటయి కూడా ఇంగ్లీషు మాట్లాడటానికి సంకోచించేవారు.
* ఇంటర్వ్యూలో అనుత్తీర్ణులయినవారు, మంచి ఉద్యోగాలు రానివారు.
* కళాశాలలో, సంఘంలో, క్లబ్బులో ఆధునిక యువతీ యువకులతో కలసి మెలసి తిరుగలేక పోతున్నవారు.
* బాగా చదువుకున్న పక్కింటి గృహిణులతో, చుట్టాలతో లేదా ఇతర నాగరిక కుటుంబ సభ్యులతో కలసి మెలసి తిరుగలేనివారు, ఇంగ్లీషు కాన్వెంటులలో చదివించలేని తల్లిదండ్రులు తమ పిల్లలకు ఇంటివద్ద చదివించి యోగ్యులుగా చేసేందుకు ఇది అత్యంత సహాయకరమైనది.
* వ్యాపారి లేదా కొట్టు యజమాని ఏ అధికారితోను స్పష్టంగా మాట్లాడలేకపోతే, చదువున్న వ్యక్తికి ఉద్యోగమిచ్చి సరిగా పని చేయించుకోలేకపోయినచో ఇది నిస్సందేహంగా సహాయపడుతుంది.

—అంతే కాదు జీవితంలో ప్రతి మెట్టుకు పునాది "రేపిడెక్స్ ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్" విజయానికి గ్యారంటీ!




Vth Edition

పెద్ద సైజులో
408 పుటలు
వెల : రు. 21-00
తపాలా ఖర్చులు:
రు. 4-00

## రేపిడెక్స్ కోర్సులోని ప్రత్యేకతలు:—

* సరియైన ఉచ్చారణ కోసమై పాఠాలన్నీ ఇంగ్లీషు లోను, మరియు తెలుగు లిపిలో కూడా ఉన్నాయి.
* ఏ భాషనైనా నేర్చుకునేందుకు ఇంతవరకు జాతీయ, అంతర్జాతీయ పరిశోధనల ఆధారంగా తయారు చేయ బడిన మొట్టమొదటి కోర్స్.
* సుమారు 2500 కి పైగా నిత్యం ఉపయోగించే ఇంగ్లీషు పదాలు, మీ ఘుంఘాటనను పూర్తిగా పారద్రోలుతాయి.
* సుమారు 4500 కు పైగా చిన్న చిన్న సంభాషణా వాక్యాలు-అంటు,
* ఇంట్లో లేదా కార్యాలయంలో, కళాశాలలో, లేదా క్లబ్బులో విందులో లేదా సంఘంలో...
* ప్రేయసీ-ప్రియులు, ఆలు-మగలు, అధికారి- గుమస్తా, వ్యాపారి-కొనుగోలుదారు, పెద్ద-చిన్నలతో...
* ప్రియ సంభాషణలు, అభివందనము, అభినందనము, ప్రోత్సహించుట, ఓదార్చటంలో...
* మానసికానందం, ఆరోగ్యం, అన్న-పానియాలు, వేష-భూషణాలు సామాజిక-రాజకీయ ప్రసంగాలు...
* టెలిఫోనులో, ఎదుటి మనిషితో, సభలో లేదా ప్రత్యేక సందర్భంలో...

— అంతే ఏ విషయం గురించయినా...ఏ అంతస్తు స్త్రీ-పురుషులతనయినా...సరైన పద్ధతిలో నిస్సంకోచంగా ఇంగ్లీషులో మాట్లాడేందుకు అవసరమైన సంభాషణలు.

"రేపిడెక్స్ ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్" విజయానికి గ్యారంటీ!

VANDANA

**డబ్బు వాపసు గ్యారంటీ**
మీకు 'రేపిడెక్స్ కోర్సు' సంతృప్తిని కలిగించక పోతే పుస్తకాన్ని తిరిగి పంపండి. తపాలా ఖర్చులు మినహాయించుకొని, మిగిలిన పైకమంతా మీకు పంపిస్తాము.

'రేపిడెక్స్ కోర్స్' అన్ని పుస్తకాల దుకాణాలలోను, బస్సు స్టాండులలోను, రైల్వే స్టేషను మరియు విమానాశ్రయాల్లోని బుక్ స్టాల్సులోను దొరుకుతుంది.



ప్రకాశకులు :
పుస్తక్ మహల్, ఖారీ బావులీ, ఢిల్లీ-6.
PUSTAK MAHAL KHARI BAOLI, DELHI-110006

"RAPIDEX" COURSE AVAILABLE AT : STOCKISTS; - HYDERABAD : Book Selection Centre, Sultan Bazar; Rajkamal Book Agency, Sultan Bazar. * VIJAYAWADA : Navodaya Publishers, Eluru Road; Sree Venkateshwara Book Depot, Eluru Road. * VISAKHAPATNAM : Gupta Bros Books, Main Road; Book Centre, Main Road. * ELURU & GUNTUR : Lalitha & Co. * NELLORE : Sri Srirama Students Emporium, Trunk Road. ALSO AVAILABLE at all leading bookshops, Roadways Book Stall, A.H. Wheeler & Higginbothams Railway Bookstalls throughout South India.











# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 - 1972]
శుక్రవారం : 7 12 '79
సిద్ధార్థినామ సం. మార్గశిర బ. చవితి
**సంపుటము 73 : సంచిక 15**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



...ట్టమీద బొమ్మ :
నటి అరుణా ఇరానీ
ఫోటో : కాంతిలాల్ ఖత్రీ

**కథలు:**


అది గౌరవించే పయసా? ... 6
కొత్త చెప్పులు ... 36


**సీరియల్ కథలు :**


ప్రాకీసు పెట్టి చూడు ... 9
సుదూర తీరాలు ... 20


**వ్యాసాలు, శీర్షికలు :**


లోకంపోకడ - 4. పాలాక్షిని డైరీ - 8. వంటలు - 18. సినిమా - 28. బొమ్మల మహాభారతం - 42. ప్రశ్నావళి - 44. వారఫలం, ధర్మపథం-51. హైదరాబాద్ నోట్ బుక్ - 54. ఢిల్లీలో భువన విజయం-56. ఉత్తరాలు-58.

# సూర్యాస్తమయ సమయము-లోని సంతృప్తి;

జీవితంలో ఒడుదుడుకుల మధ్య మీరు చాలాకాలము గడిపారు. మీరు కష్టపడి అలిసి పోయారు. బరువు బాధ్యతలను నెరవేర్చటంలో మీ భుజాలు వంగిపోయాయి. ఇప్పుడు ఆశ్రయమిచ్చే స్థలము పెరగటము వలన మీ శరీరం విశ్రాంతి కొరకు తహతహ లాడుతోంది. మీ మనవలు కథలు మరియు చిరుతిండి కోసం అరుస్తుంటే, ఈరోజు కొరకు మీరు ప్రణాళిక వేసుకొని పొదుపు చేసుంటే ఆస్వాదించేవారు కాదా? ఈ ప్రపంచులో మీ కాలమంతా మీ మనవలతో గడపటానికి, వారికి చిన్న బొమ్మలు సమకూర్చటంలో కావలసినంత సొమ్ముంటే మీరు సంతోషించేవారు కాదా! మీ మనసులో సొమ్ము ఆఖరి వస్తువు! కెనరా బ్యాంకులో మీ **నిరంతర** డిపాజిట్ ప్రతినెలా సరిపోయే మొత్తాన్ని చెల్లిస్తుంది. మరియు మీరు కోరేవరకు మీ అసలు మొత్తం కెనరా బ్యాంకులో తాకబడకుండా వుంటుంది. కెనరా బ్యాంకుతో అడుగు పెట్టిన రోజు ఖచ్చితంగా ఒక శుభప్రదమైన రోజు అయివుంటుంది. ఏ డిపాజిట్ అయినా తక్కువేమీ కాదు.




**కెనరా బ్యాంక్**

(భారత ప్రభుత్వ సంపూర్ణ స్వామ్యంలోనిది)

**తక్కువేమీ కాదు;**
**'ఏ డిపాజిట్ అయినా**

maa CB 17a Tel-79

"ఏమిటో చూడండ్రా పిల్లలూ! ఆ ముసలావిడేదో అంటున్నది. చస్తున్నాను. ఇటు వంటే చేసుకోనా, ఆవిడకి వత్తాసులే వత్తనా— మార్గధారి సంత..." ఏదో చిన్నగా గొణుగుడు తప్పింక సరిగా వినపడలేదు కాంతం గొంతు వనజకి.

"ఏం కావాలి బామ్మా, చంపుకు తింటావు ఏదో ఒకటి అంటూ" అన్నగారి పెద్దకొడుకు శ్రీహరి కంఠం వినబడింది విసుగ్గా.

# అది గౌరవించేవయసా?

కె. భారతి





'ఏమిటి వీళ్ళకింత విసుగు ఆవిడంటే, పొద్దున్న వచ్చినప్పటి నుండి గమనిస్తోంది' ఇంక ఆగలేక గబ గబ తల్లి ఉన్న మూల గదివైపుకి వెళ్ళింది వనజ.

"సర్లే, మాకు తెలుసులే. నువ్వేం చెప్పక్కర్లేదు." హరి ఏదో కాగితం చేత్తో మడుస్తూ నిర్లక్ష్యంగా అంటున్నాడు బామ్మతో. 'వెధవ. పద్నాలుగేళ్ళన్నా లేవు, డెభ్భై ఏళ్ళ ముసలావిడను అవమానించడమా!' వనజకు ఉక్రోషం వచ్చింది. "నువ్వెళ్ళు హరి" అని "ఏమిటమ్మా, ఏంకావాలి" తల్లిని మెల్లగా అడిగింది.

"కాదే అమ్మాయీ, కొంతం పంచదార తెప్పించాలనుకుంది. తెస్తారుట్రా అని అడుగుతున్నాలే. మళ్ళీ రేపు కాఫీల కిబ్బంది కదూ..."

"నాకు లేకపోయినా, నీ కేదుడం మానంతే, నీ బాధ అదేగ." హరి అందుకున్నాడు. "అయ్యో. అయ్యో నాశావే తల్లీ. ఎంతెంత మాట అంటున్నాడో. నా కోసమటే, అందరికీ అవసరమే కాదూ."

"నాకు తెలుసులే..." హరి ఇంకా ఏదో అనబోతున్నాడు. వనజ కిసారి కోపం వచ్చింది. "నీకేం తెలుసురా. నీ ముఖం. వేలెడున్నావో లేదో పెద్దావిడని అంతలేసి మాట అంటావా. వెళ్ళిక్కడ నుండి" కసిరింది గట్టిగా.

"రెండ్రోజులు పోనీ నీకే తెలుస్తుందిలే" గొణుగుతూ విసురుగా అక్కడి నుండి వెళ్ళిపోయాడు హరి.

"ఇదే వరుస అనుకో తల్లీ! నోటమాట రానీరు. ఇలా విదిలించి కొడతారు. ఇంట్లో పెద్ద ముండా కూతుర్ని ఉన్నప్పుడు మంచి చెడ్డా చెప్పకుండా ఎలా ఉండగలను చెప్పు, ఇదంతా నా ఖర్మలే. ఇంత వయసు వచ్చే వరకు బతికుండకూడదే తల్లీ! పిల్లల్ని పెంచి పెద్దజేసి, వివరి జీవితాలు వారివయ్యాక, పెద్దగాళ్ళు చచ్చిపోవాలే అమ్మా..." ఆవిడ కొంగుతో కళ్ళు వత్తుకుంది. వనజకి దుఃఖం ముంచుకొచ్చింది. "ఊరుకో అమ్మా. నువ్వేం బాధపడకు. అన్నయ్యతో చెప్పి వాడి పొగరణుస్తాను." అంది.

ముసలావిడ ఉలిక్కి పడింది కంగారుగా కూతురి చేతులు పట్టుకుని "అంత పని మాత్రం చేయకమ్మా, విశ్వంతో ఈ మాట లేమీ అననని ఒట్టు వెయ్యి తల్లీ" అంది.

"ఏమిటమ్మా అంత కంగారు పడతావు? వెధవని రెండు వేస్తాడు అంతే కదా! వెయ్యాలి, ఇకనుండైనా బుద్ధి తెచ్చుకుంటాడు."

"అయ్యో, నీకు తెలియదు తల్లీ, చింత రాద్ధాంతమౌతుంది! ఒకసారిలాగే పిల్లలు ఏదో వాగరని మీ అన్నయ్య వాళ్ళని కొడితే, మీ వదిన ఏడుపు, రాగాలు, 'మీ అమ్మ మాటలు విని వాళ్ళని కొడతారా. వళ్ళంత విసిగి పోయి అన్నారో మీకేం తెలుసని' అంటూ! అమ్మయ్ నేను వాళ్ళను విసిగిస్తానుట. అసలు మీ వదిన మాటలవల్లే పిల్లలింత పెంకిపోయింది. ఇంక చూడు, మీ అన్నయ్య నా మీద కూడా విసుక్కుని అన్నం కూడా తినకుండా బయటికి పోయి ఎప్పుడో రాత్రికి వచ్చాడు. వద్దమ్మా, వాడికసలే బాధ చాలదు. ఈ మాత్రం శాంతి కూడా లేకుండా పోతుంది నాకు. పోనీలే కుర్ర వెధవలు ఏదో అంటూనే ఉంటారు."

అమ్మకెంత క్షమాగుణం, 'నోరు ముయ్యరా వెధవా' అని అదిలించక —

వాడన్న మాటలు సహించి వాడ్ని క్షమిం చేస్తోంది.

* * *

సాయంత్రం కాఫీల దగ్గర మెల్లిగా మాట ఎత్తుకుంది కాంతం; "ఏమిటి వనజా, మీ అమ్మగారు అంటున్నారు ప్రొద్దుట ?"

"ఆఁ ఏంలేదొదినా, పంచదార తేవాలని జ్ఞాపకం చేసింది, అంతే. శ్రీహరి కస్సుమన్నాడు!"

"వనజా, ఇలా చెబుతున్నానని ఏమీ అనుకోకు. మీ అమ్మైనా, మా అమ్మైనా ఒకటే. పెద్దతనం వచ్చిందా; తిని హాయిగా 'కృష్ణారామా' అనుకుంటూ కూర్చోక ఆవిడ కెందుకొచ్చిన తాపత్రయం చెప్పు. ప్రతీ విషయం ఆవిడకే కావాలి. షీలని 'స్నానం చేసావా, జడేసుకున్నావా, బడికి వేళౌతోందం'టూ ఒకటే సతాయిస్తే..."

"షీలెవరొదినా ?!" మధ్యలోనే అడిగింది వనజ.

"అదే మన సుశీలే వనజా. నువ్వు రెండు సంవత్సరాలయ్యింది కదూ ఇటు వచ్చి, ఎక్కడో ఉత్తరాదిన ఉన్నావు. ఏమిటో, ఏడాది కోసారి వస్తున్నా దూరాభారం..."

"ఇంతకీ పేరెప్పుడు మార్చుకుందీ..."

"ఈ ఏడాదే, కాలేజీలో చేరాక. దాని స్నేహితు లందరూ 'సుషీలా, సుశీలా' అని పిలుస్తుంటే 'షీల' అని మార్చుకుందిట. పోనీ, పేరు కేమిటి చెప్పు. చిన్నపిల్ల, నల్గురిలో తిరిగే టప్పుడు కావాలని తగ్గట్టు ఫేషన బట్టి మారుతారు. వయసులో పిల్లలు ఫేషన్నొద్దంటే, ఎలా వింటారు చెప్పు దానికి ఆవిడ ఎంత గొడవ చేసిందని "బామ్మా, నన్నిప్పటి నుండి షీలా అనే పిలు" వందనీ, 'షీలా, ఏమిటే షలానూ–పీలానూ. షీల కర్థ మేమిటో చెప్పసలు, నాకు తెలియ కడుగుతాను. బంగారం లాంటి సుశీల అన్న పేరుని అంత దరిద్రంగా మారుస్తారటే, ఎవరైనా వింటే నవ్విపోతారు.' అంటూ సణుగుడు మొదలెట్టింది. దీని కందుకనే అమ్మన్నా చూస్తే కోపం. స్వంత తల్లి దండ్రులంటేనే పిల్లలీ రోజుల్లో మాట వినరు–ప్రతి దానికి అంక్షలు పెడితే వినుక్కోరా మరి."

'నిజమేనేమో' అనిపించింది వనజకు. 'పోనీ అమ్మ కెందుకు ప్రతి విషయం–వదిన చెప్పినట్టు కృష్ణా రామా అంటూ కూర్చోక' అనికూడా అనిపించింది.

"ఏమిటో, ఈ వెధవ గొడవతో కాఫీ ఇవ్వనేలేదు. తీసుకో చల్లారి పోతుంది. ఎప్పుడూ ఉన్నదే మాకు." వదిన గొంతులోని నిష్ఠూరతకు మనసు చివుక్కుమంది వనజకు.

కాఫీ త్రాగుతుంటే మళ్ళీ ఎత్తుకుంది కాంతం. "ఒక విషయం కాదనుకో. ప్రతిది ఆవిడకే కావాలి. 'లేవండ్రా–ఇంకా లేవలేదేం, త్వరగా స్నానాలు చేయండరా–కాఫీలు పోతుంది. బజారుకెళ్ళి కూరలు తెచ్చావా, సరుకులు తెచ్చావా; చదువుకోండ్రా– పరీక్షలొస్తే కష్టం. స్కూలుకి టైమయ్యింది– ఇంక పొండ్రా' అంటూ ఇలా అన్ని విషయాల్లోనూ పదే పదే సతాయిస్తే ఎంతకని ఎవరు భరించగలరు చెప్పు మన పెద్దవాళ్ళకే ఒకే విషయం ఒకటికి రెండుసార్లు చెబితే విసుగేస్తుంది కదా! ఇంక పిల్లలు– అందులో ఈ కాలం వాళ్ళు మాట వింటారా? మీ కెందుకమ్మా ఊరుకోండి అంటే ఈవిడ వినదు; వాళ్ళూ ఏదో అనకమానరు. ఇదేగోల అనుకో రోజూ ఈ ఇంట్లో. అయ్యో, అదేమిటలా ఆగిపోయావు, కాఫీ తాగేయ్. ఉప్మా తిందువు."

కాఫీ గ్లాసు క్రిందపెట్టి ఉప్మాప్లేటు అందుకుంటూ "పోనీలే వదినా, పెద్దతనం కద, చాదస్తం ఎక్కువవుతుంది." అందప్పటి కలాగే.

"పెద్దావిడనే ఇలాగే సర్దుకుపోతున్నాం, కానీ ఎంతకని ?!–... ఉష్ ...మీ అన్నయ్య వచ్చినట్టుంది. ఆ విషయం ఇంక ఎత్తకు" అడపడుచుని హెచ్చరించి మంచినీళ్ళగ్లాసుతో ఛర్కోసం హాలులోకి వెళ్ళింది కాంతం.

ఉప్మా తింటూ ఆలోచిస్తోంది వనజ – 'అమ్మకీ, వదినకీ కూడా అన్నయ్య బాధపడకూడదనే ఉంది ఈ విషయంలో. కానీ వీళ్ళలో వీళ్ళకే సామరస్యం లేకుండా పోయింది. అమ్మ ఏదో ఒకటి వీళ్ళకి చెబుతూ ఉంటుంది, వీళ్ళకి విసుగు. ఎక్కడుంది లోపం ... ఏమైనా అమ్మకి చెప్పాలి– ప్రతివిషయం కల్పించుకో వద్దని' –నిశ్చయించుకొంది చివరకు.

* * *

ఆ మరునాటి వరకూ తల్లితో ఆ విషయంలో కదపడానికి వీల్లేకపోయింది వనజకు. అన్నయ్య ఆఫీసుకు, పిల్లలు స్కూళ్ళకు, కాలేజీలకు వెళ్ళి; వదినగారు నిద్రపోతున్న సమయంలో వనజ మెల్లిగా తల్లి దగ్గరకు చేరింది. నిద్ర పట్టక పోయినా పడుకొని ఉన్న ముసలావిడ కూతుర్ని చూస్తూనే "ఏం తల్లీ, పడుకోలే" అంటూ లేచింది. ఆ కబురూ, ఈ కబురూ చెప్పకున్నాక వనజ మెల్లిగా తల్లిని అడిగింది. "అమ్మా, ఏమనుకోకపోతే ఒకటడగాలనుకుంటున్నాను. బాధ్యతలు చూసుకోవడానికి అన్నయ్య, వదిన ఉన్నారు కదా! హాయిగా వేళకింత తిని 'కృష్ణారామా' అనుకుంటూ కూర్చోక నీ కెందుకమ్మా ఈ తాపత్రయం ? వాళ్ళకి ప్రతి విషయం పదే పదే చెబుతుంటే విసుగురాదా, నువ్వే ఆలోచించమ్మా..."

ముసలామె మొదట కూతురి మాటలకు నిర్ఘాంతపోయింది. "నువ్వూ అలాగే అంటున్నావా తల్లీ, అనమ్మా అను... అందరిచేతా చివాట్లుతినే వయసిది– అందర్నీ విసిగించే ముసలితనమే ఇగ... అన్నవే..." ముసలావిడ కంఠం ఆవేదనగా పలికింది.

(44వ పేజీ చూడండి)

## గూనికి శస్త్రచికిత్స

వెన్నెముకలో ఏర్పడే వంపును తొలగించడానికి పశ్చిమ జర్మనీలో ఒక డాక్టరు కొత్తరకం ఆపరేషన్ విధానాన్ని కనుగొన్నారు. ఈ ఆపరేషన్ కేసుయొక్క తీవ్రతను బట్టి 40 నిమిషాల నుండి ఆరుగంటలు పట్టవచ్చు. ఈ ఆపరేషన్‌లో ఒక ప్రత్యేక సాధనాన్ని వుపయోగించి వెన్నెముక స్థానాన్ని సరిచేస్తారు. ఈ ఆపరేషను క్రిందివైపు నుండి కాక పైవైపు నుండి ప్రారంభిస్తారు అందువలన యిది తక్కువ ప్రమాదకరంగా వుంటుంది. ఆపరేషను అయిన తరువాత రోగి ఏటూరుగా నడవవచ్చును. ఇటీవల పశ్చిమ జర్మనీలో జరిగిన ఒక సెమినార్‌లో యీ ఆపరేషను విధానాన్ని ప్రదర్శించారు.

(గత సంచిక తరువాయి)

పీక వేళగానే వీరేశం కుర్చీలో కూర్చుంటూ
డాక్టర్ ఇంత పనిచేసేవయ్యా? వీడు బంగారపు బాతు! నువ్వు ఒక పది యింజక్షన్లు పొడిచి డబ్బు చేసుకుంటావు — అది తెస్తే నువ్వు కానీ తీసుకోకుండా నీకు ఏం జబ్బులేదు, పరిగెత్తు అంటూ పంపించేసేవేంటి?! వీడి డబ్బంతా డాక్టర పాలేనే! అందరూ బాగుపడ్డప్పుడు నువ్వుకూడా ఎందుకు పడకూడదు? అని నేను అనుకుంటూంటే!' అని విమలతో 'చూడమ్మా నిన్నరాత్రి నించీ వాడిని మచ్చిక చేసి నచ్చచెప్పి తెచ్చేటప్పటికి నా తాతలు దిగేరు. అయినా ఒక్కరోజు కష్టాన్నీ ఒక్కమాటతో తుడిచేసేడు! ఇలా అయితే ప్రాక్టీసు ఏం సాగుతుంది చెప్పు? నాడు! ఆ ప్రక్కవీధి డాక్టరు— నర్సింగ్‌హోం కట్టాలి అనుకుంటున్నాడు. ఎలా అనుకుంటావు? రోగాలు లేనివాడికి రోగాలు ఉన్నట్టు భ్రమింపచేసి, అయినా రోగాల్ని మనం తయారుచేసుకోవాలయ్యా! ఉన్నదాంట్లో...'

'అలాంటి పన్లు నాకు చాతగావండీ'

'నేర్చుకోవాలి! నువ్వు అరగంట వీరేశతో మాట్లాడేవా? నీకు ఏం వొచ్చింది? సలహా చెప్పినందుకు కనీసం ఫీజు ఎంత అని అయినా అడిగావా? వాళ్ళు నిన్ను పాగకుని— నీకు డబ్బు యివ్వనప్పుడు నువ్వే వాళ్ళనించి తీసుకోవాలయ్యా! దానికి మార్గమే యింజక్షను! నీళ్ళు నింపి—పది రూపాయల యింజక్షను యిస్తున్నాను! అని అది యిచ్చి తర్వాత నీ సలహా పడేయ్. అప్పుడు నీకు ఎంకరేజింగ్‌గా ఉంటుంది. వాళ్ళకూ యిది పదిరూపాయల యింజక్షనే! యిది పరిగెత్తలేనే పనిచేస్తుంది! అన్న ఉత్సాహం ఉంటుంది. రేపు నేను తెస్తాను తిరిగి వీరేశాన్ని. నువ్వు ఒక యింజక్షను పొడిచేసి...'

'యిప్పుడు వొద్దులెండి తర్వాత ఆలోచిద్దాం.'

'సరే,' అని—'మా చిన్నవాడు బలే వీక్! ఏదైనా శాంపిలు సీసా...?'

'ఇంకా రాలేదండీ! రాగానే తీసి పెడతాను'

'కొంచెం నాకు తలనొప్పిగా ఉందోయ్ ఏమైనా మాత్ర...'

## సీరియల్

'తీసుకోండి' అంటూ యిచ్చేడు తలనొప్పి మాత్ర.

నేను వెళ్తాను అంటూ తనకూ విమలకూ నమస్కారం చేసి వెళ్ళిపోయేడు.

'అవును ఆయన చెప్పినట్టు...' అంటూ విమల అనబోతూంటే—









'విమలా! యీ రోజునించీ మెడిసన్ గురించీ ఎవరు సలహా యిచ్చినా నేను ఊరుకోను. ఇటువంటి ఆత్మవంచన పనులు అసలు చేయను. ప్రాక్టీసు వొస్తుందా సరే సరి. రాకపోతుందా చూడతాను. అంతేకాని నన్ను కించపరచుకొనే పనులు మాత్రం నేను చేయను.' గట్టిగా సూటిగా అన్నాడు.

**జరిగినకథ 2:** కొత్తగా డిగ్రీ పుచ్చుకున్న డాక్టర్ సుదర్శనం డిస్పెన్సరీ పెడతాడు. కాలనీలో తమ కుటుంబానికి ఇరుగు పొరుగుగా వున్న శివయ్య, వెంకట్రామయ్యల తగాదాకు పరిష్కారం సూచిస్తాడు. ఎంతోమంది డాక్టర్లకు చూపించుకొని, కొన్ని వేల రూపాయలు డబ్బు ఖర్చు పెట్టినా తగ్గని వీరేశం జబ్బుకు డాక్టర్ సుదర్శనం తగ్గే మార్గం చెబుతాడు.

* * *

తను విమలతో గట్టిగా అన్నప్పటినించీ విమల ముభావంగా వుండిపోయింది. డిస్పెన్సరీ తాళం వేసేటప్పుడు, బస్సులో కూర్చున్నప్పుడు అసలు ఉలుకూ పలుకే లేదు. తనుకూడా ఆమెను కదిలించిలేదు. అసలు మనిషికి ఒక వ్యక్తిత్వం అంటూ ఉంటుంది దాన్ని దృష్టిలో ఉంచుకుని ఎవరేనా మాట్లాడాలి. అంతేకాని చాన్సు వొచ్చింది కదా! అని నోటికి ఏంవస్తే అది ఏంతోస్తే అంత మాట్లాడటం అసలు ఉచితం కాదు.

కిటికీలోంచి చల్లగా గాలి వొస్తూంది. తొమ్మిదికి దగ్గరగా టైము కావడంనించి బస్సులో అంత జనం లేరు. తను ఎప్పుడూ రాత్రికి యింటికి యీ బస్సులో వెళ్ళినా ఏదో పలెటూరు వెళుతూన్నట్టుంటుంది. బస్సు వెళుతూన్నకొద్దీ దీపాలూ యిళ్ళూ పలచబడుతూంటాయి. కొద్దిగా చలి ఎక్కువగా ఉందేమో విమల పమిటను వెనుకమీద నించి తలమీదనించి కప్పుకుంది. ఇలా కప్పుకుంటే విమల చాలా బాగుంటుంది తను చాలాసార్లు 'విమలా కొంగు తలమీద నించి ఎందుకు లాక్కోవూ? నీకు యిది చాలా వొప్పుతుంది!' అనేవాడు.

'నాకు వొప్పనివి చాలా ఉన్నాయిలెండి!' అనేది విమల.

ఆమె దేన్ని గురించి అంటూందో తనకు బాగా తెలుసు. విమలకు అసలు సమిష్టి కుటుంబం— చిన్న యింటిలో ఇరకడం అంటూ యిష్టంలేదు. అందులో స్వేచ్ఛ లోపిస్తుంది అన్న బాధ ఆమెది. పెళ్ళయిన క్రొత్తలో సర్దుకోవాలంటే కాస్త కష్టంగా ఉండేది ఆమెకు. ఆమె మహా చిలిపిగా ప్రవర్తించేది. తమ యింట్లో మూడే గదులు! అవి చాలా చిన్నగా వుంటాయి! ఒక గది తనకంటూ యిచ్చేసినా గట్టిగా ఊపిరి పీలిస్తే అవతలగదిలోకి వినపడుతుంది. అలాంటి చిన్న యింట్లో పిల్లా పాపాతో నిండివున్న ఆ స్థలంలో తనకు అంటూ ప్రత్యేకంగా ఒక గది వున్నా, యింకా తనకు సంకోచం, విమలతో స్వేచ్ఛగ వుండాలంటే! ఆమె ఏదయినా మాట్లాడితే తనే ఆమె నోరు మూస్తూ మెల్లగా మాట్లాడు! ప్రక్క గదిలోకి వినపడుతుంది! అనేవాడు.

ఆమె గట్టిగా నవ్వితే, 'పిల్లలున్నారు ముందర గదిలో!' అనేవాడు. రాత్రిళ్ళు తమిద్దరూ ఏకాంతంగా ఉన్నా పూర్తి ఏకాంతాన్ని తను ఎన్నడూ విమలతో అనుభవించలేదు.

వొక్కోసారి చాలా సరసంగా మాట్లాడే విమల్ని తను మందలించాల్సి వొచ్చేది. 'నా భర్తతో సన్నిహితంగా పగలూ ఉండక రాత్రీ ఉండక ఎప్పుడు ఉండమంటారు?' అనేది విమల.

## ప్రాక్టీసు పెట్టిచూడు

క్రొత్తలో పెళ్ళయిన రోజుల్లో ఉత్సాహాన్ని చూపేడు. కనీసం యీ రూపంలో నయినా తమిద్దరూ ఏకాంతంగా ఉండొచ్చు అన్న తృప్తి! ఎన్నాళ్ళకు చూపేడు విమల ముఖంలో మెరుగు తను ?

సుదర్శనంలో పశ్చాత్తాపం మొదలయింది. తను యీ పిలని అనవసరంగా కసిరేడు. ఎంత బాధపడిపోతూందో? అమె




'అలా వుండే రోజులు ముందరున్నాయి యిప్పుడు మటుకు మనకు యింకా పెళ్ళి కాలేదే అనుకుందాం!' అనేవాడు తను.

ఆమె బుగ్గలు నొక్కుకుంటూ 'పెళ్ళి కాలేదా!!! మీరు ఆలోచించే మాట్లాడుతున్నారా? పెళ్ళి కాకుండా వొక అబ్బాయీ అమ్మాయి అర్ధరాత్రి యిలా ఉన్నారంటే— అలాంటి పిల్లని ఏమంటారో కొంచెం ఆలోచించేరా? ఛీ !! ఛీ!! ఎంత సిగ్గుమాలిన పని యిది? నేను అలా అనుకోలేనండీ ! మీ భార్యగా అనుకొనే ఉంటాను' అంటూ తన్ను మరీ హత్తుకుపోయేది.

అలాంటి విమల మెల్లగా కాలంతోబాటు వాలుగొండలో తన కోరికలనీ ఉత్సాహాలను మెల్లగా అణిచేసుకుంది. ఈ రోజు తను 'డిప్పెప్పరికి రా!' అంటే ఆమెతో తిరిగి

కాని 'విమలా!' అన్నాడు.

విమల తనవైపు చూసింది కన్నీరు నిండిన కళ్ళతో.

'సారీ' అన్నాడు.

ఆమె కళ్ళనిండి వొక కన్నీటి బొట్టు జారింది.

'ఏడవకు విమలా! ఎంతో ఉత్సాహంతో యింటినుండి బయలుదేరిన నువ్వు యిలా ఏడుస్తూ యింటికెళ్లడం చూస్తూంటే నాకు చాలా బాధగా ఉంది.'

విమల ఏం మాట్లాడలేదు.

'కనపడ్డ ప్రతీ వాళ్ళూ నాకు సలహాలు యివ్వడం చూసి నేను ఊరుకోలేకపోయేను. వాళ్ళనంతా ఏం అనలేక పోయేను. ఏమన్నా వాళ్ళు పడరు. నువ్వు నా మనిషివి. నీవు అభిమానంతో నేను ఏం అన్నా పడతావని

నేను కసరుకున్నాను. నేను నీమీద తప్పితే యింకెవరిమీద విరుచుకు పడలేను. నీముందర తప్పితే మరింకెవరి ముందరా దుఃఖపడలేను.'

యీ మాటలు విమలని కదిలించివేసే యేమో ? ఆమె ముఖంలో నిండిన బాధ మాయం అయింది ఈ సంఘటనే ఏకాంతంలో జరిగి ఉంటే ? విమల ఏంచేసేదో తనకు తెలుసు ! తన ముఖాన్ని ముద్దులతో నింపివేసేది ! !

ఆ భావం ఆమె అర్థం చేసుకున్నట్టు ఆమె చెక్కిళ్ళు ఎరబడ్డాయి.

ఇంతలో బస్‌స్టాప్ వచ్చింది. అదే ఆఖరి స్టాప్ ఇక్కడనించి బస్ వెనక్కి తిరిగి వెళ్ళిపోతుంది. బస్‌స్టాప్‌కీ తమ కాలనీకి మధ్యలో బోలెడు ఖాళీ ప్రదేశం. ఇంకా యిక్కడ యిళ్ళు పడలేదు. పదినిమిషాలు నడిస్తే యిల్లు. త్రోవంతా ఎత్తుపల్లాలతో లైటు ఉండదు కాబట్టి క్రొత్త వాళ్ళకు కొద్దిగా కష్టంగా ఉంటుంది. తనకు ఎన్నో ఏళ్ళనించి అలవాటుగా వ త్రోవ అది. కళ్ళు మూసుకుని కూడా నడిచేగలడు.

రాత్రికావడంనించి అక్కడ మనుష్యులే కావరారు. బస్సు టర్న్ అయి వెళ్ళిపోగానే తను విమల చేయి అందుకున్నాడు. రాత యినా—దీపాలు లేకపోయినా— రోడ్డుకావడం నించి విమల కొంచెం సిగ్గుపడి చెయి వెనక్కి లాక్కోబోయింది. అతను లాక్కోనీయకుండా పట్టుకుని 'విమలా మై డియర్!' అంటూ చేతిని ఆమె భుజం చుట్టూ పోనిచ్చేడు.

'వొద్దండీ !' అంది అతిమృదువుగా.

'యీ మాట యింట్లో అనాలి. అంతే కాని సిగ్గుపడడానికి కనీసం చంద్రుడయినా లేడే— యిక్కడేంటి ఆ వొద్దు అంటూ అనడం ?'

ఆమె మాట్లాడలేదు.

చల్లగా తగిలే గాలికి శరీరాల్ని వొకరి సామీప్యంలో మరొకరు వెచ్చ చేసుకుంటూ యింటికి వెళ్ళేరు. ఇంటిముందు మాత్రం బుద్ధిగా విడం విడంగా యింట్లో ప్రవేశించేరు.

తమ యిద్దర్నీ చూస్తూనే పిల్లలు, 'డాక్టరూ ! కాంపవుండరూ ! వొచ్చేమనింటికి! ఎవరేనా జబ్బు వాళ్ళుంటే వచ్చి

గుర్తుంచుకోండి—

**తల్లి పాలు అన్నిటికన్నా ఉత్తమం**

(ప్రకృతి యిచ్చే యీ వరానికి బదులుగా మరొకటి లేదు.) అందుకే, వీలైనంత వరకూ పాపకు మీ పాలే యివ్వండి. అయితే, మీరిచ్చే చనుబాలు గనక సరిపోకపోతే, అమూల్‌స్ప్రే యివ్వడం మొదలెట్టండి.

**మొదటి నుంచీ అమూల్‌స్ప్రే యివ్వండి—అన్నిటికన్న జనాదరణ పొందిన శిశు ఆహారం**

అమూల్‌స్ప్రేకి దానికి కాగల ప్రత్యేకతలు—

- ఖచ్చితంగా సంతులితమైనది
- విటమినులతో నిండినది
- సులభంగా జీర్ణమౌతుంది
- సులభంగా కరుగుతుంది






# అమూల్‌స్ప్రేతో అభివృద్ధి మొదలౌతుంది దానిని బాల్‌అమూల్ పరిపూర్ణం చేస్తుంది






6వ నెల నుంచీ

**బాల్ అమూల్ కూడా యివ్వండి అత్యంత పుష్టికరమైన, పాలతో కలిసిన సిరియల్ ఆహారం**

6వ నెలనుంచీ, పాప ఎంత వేగంగా పెరుగుతాడంటే, పాప బరువు పుట్టినప్పటికన్నా రెట్టింపు అవుతుంది, మరి 3 ఏళ్ళ కల్లా పాప మెదడు 80% దాకా వృద్ధి చెందుతుంది. అందుకే కేవలం పాలు మాత్రం యిస్తే చాలదు. పాపకు ప్రోటీను, విటమినులు, ఖనిజ పదార్థాలూ ఎక్కువగా, అదీ బాగా సంతులితమైన రూపంలో అందాలి. అవి కేవలం బాల్‌అమూల్‌లోనే అన్నిటికన్న ఉత్తమమైన రూపంలో లభిస్తాయి.

**బాల్‌అమూల్ మన దేశంలోని శిశువుల కోసం ప్రత్యేకంగా తయారైంది.**

బాల్‌అమూల్, సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌వారి సహాయంతో—వెల్లూరు క్రిస్టియన్ మెడికల్ కాలేజివారిచే పరీక్షించబడినది—

**బాల్ అమూల్‌లో మరింత పోషణ గల విలువ.**

- డ్రాంతు చేయబడిన యితర మన ఆహారం, సిరియల్ ఆహారాల కంటె కనీసం 25% హెచ్చు ప్రోటీను.
- మరింత హెచ్చు కాల్షియం, విటమిన్ ఏ మరియు సి.
- కొవ్వు పదార్థాలు, ఇనుము, మరియు విటమిన్ బి కాంప్లెక్స్‌తో యిది పటిష్టం చేయబడినది.
- ముందుగానే పాలతో వండబడినది, తేలికగా అరుగుతుంది, రుచిగలది.
- పప్పు, పండ్ల గుజ్జు, పుడ్డింగ్ మొదలైన వాటితో సులభంగా కలుస్తుంది.

**బాల్ అమూల్‌తో మీరిచ్చే దబ్బుకు రెట్టింపు విలువ అందుతుంది.**

SP-AB-5/79

**ఉచితం:** సమాచారం గల అమూల్ బేబీ బుక్ మరియు బాల్ అమూల్ గ్రోత్ రికార్డ్ బుక్‌లెట్ ఇంగ్లీషులోనూ, అమూల్ బేబీ బుక్ హిందీ, తమిళం, తెలుగు మరియు మళయాళంలో కూడా దొరుకుతుంది. వాటి కోసం పోస్టు బాక్సు నం 10124, బొంబాయి 400 001 కి, మీ పూర్తి చిరునామాతో బాటు రూ. 1.00 పోస్టేజి స్టాంపులను పంపండి.



విక్రయదారులు: గుజరాత్ కోఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్.

# 'ప్రాక్టీసు పెట్టిచూడు'

యింటిక్కను పొడిపించేసుకోండి!' అంటూ హాస్యం చేయసాగేరు.

'నోర్మూసుకోండిరా!' అంటూ అందరి మీద కసిరి 'యిక లేవండి తిండికి! వేళ వొచ్చేసెంకదా?' అన్నాడు.

పిల్లలు తిరిగి 'డాక్టరూ కంపౌండరూ మనింటికి భోజనానికి వచ్చేసేరు! డిన్నర్ ఎరేంజిచేయండి?' అంటూ అరవసాగేరు.

ఈ యిల్లంటే తనకు చాలా యిష్టం. ఇంట్లో అందరూ చలాకీగా సరదాగా కలుపు




గోరు తనంగా ఉంటారు. వీళ్ళందరికీ సెన్స్ ఆఫ్ హ్యూమర్ ఎక్కువే.

అందరూ అన్నంముందు కూర్చున్నారు.

తండ్రి 'యిక కానీండి' అనేటప్పటికి యిక అన్నంతో కుస్తీ పట్టడం మొదలు పెట్టేరు.

'హారేయ్ పిల్లలూ! దెయ్యంలా ఆ తినడం ఏంటి? మెల్లగా తినండి' అని కసిరి 'యివాళ ఎలా ఉందేంటి క్లినిక్కు?' అంటూ తండ్రి అన్నాడు.

'ఫర్వాలేదు' అన్నాడు తను.

యీాయన యిక్కడ సలహాలు యివ్వడం మొదలు పెడ్తాడో! అని విమల భయపడింది. కాని అతను ప్రాక్టీసు గురించి మాటే ఎత్తకుండా 'హారేయి? రేపు మన కాలనీలో తారురోడ్డు వేయించడానికి వొక అప్లికేషన్ తిరిగి మునిసిపాలిటీకి రాయిరా. యీసారి వీలయితే రాత్రి మునిసిపల్ కమీషనర్‌నే కారులో తీసుకురావాలి! అతను తన స్వంత కారులో రాలేకపోతే మనమే వొక టాక్సీలో తీసుకువస్తే – అప్పుడు తెలుస్తుంది రాత్రి కార్లూ, స్కూటర్లూ, సైకిళ్ళూ, యీ కాలనీకి రావడం ఎంత కష్టమో?'

తండ్రి కాలనీ గురించి చాలా పాటు పడ్డాడు. ప్రతీ సమస్యా అతను కదపకపోతే ఎవరూ పట్టించుకొనేవారు కాదు. అతను గట్టిగా పట్టుకుంటే నలుగురూ కలిసేవారు. కరెంటు అతను కోరిపోరి వేయించినదే. అక్కడ బడి గురించి మొదట అతనే ప్రస్తావించేడు. పోలీస్ స్టేషన్ కావాలనీ, పోస్టాఫీసు అవసరం అనీ అతనే కల్పించుకున్నాడు. అతనే గాని లేకపోతే కాలనీ యిప్పటికీ ఏ విషయంలోనూ ముందడుగు వేయలేకపోయేది.

'సరే' అన్నాడు తను. తిరిగి అతనే 'ఆ శివయ్యకు అప్లికేషన్ యిచ్చి అందరిచేతా సంతకాలు పెట్టించమను. చిల్లరకొట్టు కావడంనించి చాలా మటుకు ఈ కాలనీ వాళ్ళంతా రోజుకోసారి అయినా అక్కడ వొస్తూంటారు!' అన్నాడు.

'అలాగే' అన్నాడు తను.

'హారేయ్ ఏంటి? అన్నం కొంచెం ఎక్కువ కలుపు కూరలోకి! యిలా తింటె ఏం బలం వుంటుంది! రోజు రోజుకూ నాజూకు అయిపోతున్నావ్!' అంటూ తండ్రి నవ్వు గదమాయించేడు.

ఆ రోజు ఆకలి అంతగా లేదు తనకి. 'ఇంకొద్దు నాన్నా' అన్నాడు తను.

'ఎందుకేంటి? హోటలులో ఏమైనా తిని వొచ్చేవా?' అంటూ గట్టిగా ప్రశ్నించేడు తండ్రి.

'లేదునాన్నా' అన్నాడు తను.

'అయితే యింకొంచెం కలుపు ఊ!' అన్నాడు.

అతని మాట వినకపోతే అతనికి కోపం వస్తుంది. తను కలపబోతున్నాడు.

ఇంతలో 'డాక్టరుబాబూ! నన్ను బతికించు నేను చచ్చిపోదలచుకోలేదు' అంటూ సుబ్బారావు తను తింటూన్న గదిలోకి వచ్చేసేడు.

'ఏమయింది సుబ్బారావూ?' అంటూ అడిగేడు తండ్రి.

'మళ్ళీ టిక్ ట్వెంటీ తాగేసేను బాబూ చచ్చిపోదామని! తాగేసిం తర్వాత నాకు బతకాలని అనిపించిందండి! నన్ను బతికించండి! చావనీయకండి!' అంటూ ఏడ్చేస్తున్నాడు సుబ్బారావు.

తను కంచం ముందరనించి లేచి చేయి కడుక్కొనే లోపలే తండ్రి 'మళ్ళీ ఎందుకు తాగేసేవ్? యీసారి ఏం అయింది?'

'ఏంటో బాబూ అన్నిటి మీదా విరక్తి కలిగిందండి! ఏంటి చెప్పండి ఈ జీవితం? అవే ఉదయాలూ– అవే మధ్యాహ్నాలూ– అవే సాయంత్రాలూ– అదే పని– అదే పిల్లలూ అదే పెళ్ళాం– ఇదంతా మాయ అండి! ఈ మాయనించి విసుగొచ్చి చద్దాం అనుకున్నాను బాబూ! తీరా పల్లుల మందు తాగేసిం తర్వాత, యీ ప్రాణం మీద తీపి తెలిసొచ్చిందండీ. నా పెళ్ళాం పిల్లలూ ఏం కావాలండి? వాళ్ళు ఎలా బతుకుతారు? నా పెళ్ళాం అసలే అమాయకపుది! దానికి యింత తిండి ఎవరు పెడ్తారు?' అంటూ గోల పెట్టేస్తున్నాడు సుబ్బారావు.

తను చేయి కడుక్కొచ్చి సుబ్బారావుని చాపమీద పడుకోబెట్టి 'ఎంత సేపయిందెంటి తాగి?' అన్నాడు. 'ఇరవై నిముషా

అయిందండీ!' అన్నాడు. 'అలానా!' అంటూ చేయవలసిన పరీక్ష అంతా ఒక నిమిషంలో ముగించి 'అమ్మా! ఒక గరిటెడు ఉప్పు గ్లాసు నీళ్ళలో కలుపు' అంటూ తల్లితో అని ఆమె లేవడం ఆలస్యం అవుతుందని తనే కలపడానికి వంటింట్లోకి వెళ్ళేడు.

'ఏంటి సుబ్బారావ్, నీ భార్యకు పురుడు వొచ్చిందా?' అన్నాడు తండ్రి.

'ఇంకా రాలేదండీ! దానికి యిప్పుడు దినాలు. దాన్ని పుట్టబోయే పిల్లని యీ కళ్ళతో చూసుకుంటానో లేదో? అది పుట్టింటికి వెళ్ళగా నాచేత వొట్టు వేయించుకుందండీ ఏం అఘాయిత్యం చేయొద్దని! ఇప్పుడు నాకేం అయినా అయితే ఆ మాట ఏంగావాలి?'

'ఈబుడ్డి తాగేటప్పుడు ఏంఅయింది?'

ఇంతలో తను గ్లాసుడు ఉప్పునీళ్ళతో వచ్చి 'యిది వొక్క గుటకలో త్రాగెయ్' అన్నాడు. సుబ్బారావు తాగేసేడు. అతను తాగేలోపల తను ఒక యింజక్షను తెచ్చి, యిచ్చి అతను తాగిన తర్వాత 'సుబ్బారావ్ యిక లే మనం బావి దగ్గరికి వెళ్దాం' అని అతని చేయి పట్టుకుని తీసుకు వచ్చేడు.

బావిదగ్గర అతనిచేత గొంతుకలో వేయి వేయించి కక్కించేడు. ఒకసారి కక్కిన తరువాత తిరిగి కొన్ని ఉప్పునీళ్ళు యిచ్చి, తిరిగి కక్కించేడు. మూడోసారి కూడా కక్కించిన తర్వాత లోనికి తీసికెళ్ళి మంచంమీద పడుకోబెట్టి 'కళ్ళు మూసుకొని పడుకో!' అన్నాడు.

'డాక్టరు బాబూ నాకు ఏం కాదుకదా? నేను బ్రతుకుతానా?' అంటూ దీనంగా అడిగేడు. 'ఏం కాదులే!' అన్నాడు తను. అతను తన చేతిని గట్టిగా పట్టుకుని 'డాక్టర్ నీ చేతిని విడవకుండా గట్టిగా పట్టుకుంటే నాకు ధైర్యంగా ఉంటుంది. విడవను.'

చాలా జాలి అనిపించింది, తనకు ఆ మాటలు. 'సరే' అన్నాడు..

సుబ్బారావు చాలా విచిత్రమయినమనిషి. అతనికి ముగ్గురు పిల్లలు, భార్య నాలుగో సారి కాన్పుకు వెళ్ళింది యిప్పుడు. అతను అయిదు వందలదాకా నెలకు సంపాయిస్తాడు. మనిషికి ఏ వ్యసనాలూ లేవు. కాని వొక్కటే పిచ్చి! ఎప్పుడూ పుస్తకాలు చదువుతూ ఉంటాడు. అతనికి వేదాంతం

## ప్రాక్టీసు పెట్టిచూడు

పుస్తకాలంటే ప్రాణం. అతనితో మాట్లాడాలంటే అందరికీ భయం. నోరు విప్పితే జీవాత్మ పరమాత్మ అంటూ మొదలు పెడ్తాడు. అందుకే అందరూ అతన్నించి తప్పించుకోనేందుకు ప్రయత్నిస్తుంటారు. ఆయన భార్య ప్రతీయేడూ కాన్పుకు పుట్టింటికి వెళ్ళిపోతుంది మూడు నెల్లు. ఆమె రెండు కాన్పుల వరకూ యితను బాగానే ఉన్నాడు. ఆమె మూడో కాన్పుకు వెళ్ళగానే యితను అదేపనిగా వేదాంతం గ్రంధాలు చదివేడేమో? అతనికి బ్రతుకు మీద విరక్తి వొచ్చి నల్లుల మందు త్రాగేసేడు! త్రాగేసింతరువాత బ్రతుకు మీద తీపి తెలిసిందేమో తన దగ్గరికి పరిగెత్తుకుంటూ వచ్చి కాళ్ళమీద పడ్డాడు. అప్పుడు తను హౌసర్జన్‌గా పని చేస్తున్నాడు. 'ఆసుపత్రికి వెళ్ళు' అన్నాడు తను. 'అక్కడికి వెళితే యిది పోలీస్ కేస్ అంటూ కోరు కేసు చేస్తారు. నువ్వే ఏదైనా చేసి పుణ్యం కట్టుకో' అంటూ బ్రతిమాలేడు.

అతను చెప్పిందీ నిజమే. ఆసుపత్రి

కెళితే పోలీసు కేస్‌చేసి వీళ్ళను బాగయిం తర్వాత కోర్టుల చుట్టూ తిప్పుతారు. అందుకే తనే ఆసుపత్రిలో యిచ్చే ట్రీట్‌మెంటు యిచ్చి బాగుచేసింతరువాత నాలుగు చివాట్లు యింటికి పొదీ పెట్టేరు.

యీ సంవత్సరం భార్య కాన్పుకు పోగానే తిరిగి అదేపని చేసేడు.

తండ్రి 'ఏమైనా ప్రమాదం ఉందా' అంటూ అడిగేడు. 'ఏంలేదు! మీరంతా పడుక్కోండి!' అన్నాడు తను.

అరగంట అరగంటకూ, అతన్ని పరీక్ష చేస్తూ రాత్రంతా గడిపేసేడు.

ఇక యింటికి వెళ్ళొచ్చు! అని సుబ్బారావుకి చెప్పేటప్పటికి మూడయింది. అప్పటిదాకా విమల తనతోనే ఉంది.

'నువ్వు పడుక్కో!' అంటే 'ఊహూ!' అనేది.

మూడు గంటలకు సుబ్బారావుని పంపించి యిద్దరూ నిదురపోయేరు.

తను నిద్ర లేచేటప్పటికి విమల యింకా నిదురపోతూనే వుంది. ఆమెని లేపడానికి యిష్టంలేక తానొక్కడే కాలకృత్యాలన్నీ కానిచ్చి టిఫిన్ డబ్బాలో పెట్టుకుని క్లీనిక్‌కి వెళ్ళిపోయేడు.

తాళంతీసి కావలసిన సరంజామా సిద్ధం చేసుకుని కుర్చీలో కూర్చున్నాడు. అతనికి సుబ్బారావు జ్ఞాపకం వొచ్చేడు. నవ్వొచ్చింది.

'ఏంటి డాక్టరూ ఎలా ఉన్నావు?' అంటూ వీరేశం ప్రవేశించేటప్పటికి తను మొదట ఆశ్చర్యపోయేడు. నెల తర్వాత రమ్మంటే యిప్పుడే వచ్చేసేడేంటి? అని.

తన ఆశ్చర్యాన్ని పసికట్టకుండానే ఆయాసంతో రొప్పుతూ బొంగురు గొంతుకతో 'డాక్టరూ నీవు యిచ్చిన సలహా జరిగేటట్టు లేదు!' అన్నాడు.

'ఎందుకేంటి?' అన్నాడు.

'ఇక్కడ ప్రొద్దున్న ఆరు అయిందంటే మనుష్యులు తిరగడం మొదలు పెడ్తారు. వాళ్ళ ముందర పరిగెడ్తే నాకు చిన్నతనంగా ఉంటుందని అయిదు గంటలకే లేచి పరిగెత్తేను. కుక్కలు వెంటపడ్డాయి. అందుకే పరిగెత్తడం కాదు. దాని బదులు యింకో మార్గం చెప్పు!'

తను ఆలోచిస్తున్నాడు. ఇంటి వోనరు నరసింహం అవతలికి వెళ్తూ తన్ను చూసి 'డాక్టరూ! అమ్మాయి వొస్తుంది. కొంచెం పరీక్షచేసి మందీయ్, బిల్లు నెలయింతర్వాత కడ్తాను' అని తను సరే అన్నట్టు తలఊప గానే వెళ్ళిపోయేడు.

'ఏంటి డాక్టరూ?' అంటూ తిరిగి అడిగేడు వీరేశం.

'నీకు స్కిప్పింగ్ వొస్తుందా!' అన్నాడు తను.

'అంటే?'

'అదే తాడు పట్టుకుని ఎగరడం.'

వీరేశం నవ్వేస్తూ 'డాక్టరూ కాని పనులు చేయమంటే ఎలావోయ్?'

'కానిపని అంటే లాభంలేదు చెయ్యాల్సిందే.'

'సరే ప్రయత్నిస్తాను' అంటూ లేస్తూ 'డాక్టరూ నువ్వు నాకు నచ్చేవోయ్! పుట్టిన యిన్నేళ్ళకు డాక్టరు దగ్గరికి వొచ్చి డబ్బు విదల్చకుండా వెళ్తున్నాను' అంటూ లేచిజేబు లోంచి అయిదు రూపాయల నోటు తీసి బల్లమీద పెట్టి వెళ్ళబోయేడు.

'ఇదేంటండీ ?'

'ఇది అంతే! డాక్టరు దగ్గరికీ, దేవుడు దగ్గరికీ, పసిపిల్లవాడ దగ్గరికీ వొట్టి

చేతులతో [illegible]కూడదోయ్!' అంటూ తను పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయేడు.

టేబుల్ మీద ఉన్న అయిదు రూపాయల నోటును ఆప్యాయంగా తీసుకుని ముద్దు పెట్టుకుని ప్రయివేట్ ప్రాక్టీసులో నా మొదటి అయిదు రూపాయలు... అంటూ దాన్ని భద్రంగా తీసి జేబులో పెట్టుకున్నాడు.

ఉత్సాహంతో మనస్సు ఉరకలు వేస్తూంటే, ఆ సంతోషాన్ని అనుభవిస్తూ అరగంట గడిపేసేడు.

కమ్మని యింటిమేట్ సెంటు వాసన డిస్పెన్సరీలోకి వస్తే తల తిప్పేడు. ట్రిమ్‌గా డ్రస్ చేసుకుని, తల్లో మల్లెపూలు పెట్టుకుని పందొమ్మిదేళ్ళ కళ్ళతో వెలిగిపోతూ అందమైన అమ్మాయి అతి తియ్యగా 'గుడ్‌మార్నింగ్ డాక్టర్!' అంది.

తను విష్ చేస్తూ 'కూర్చో అమ్మా!' అని ఆమె కూర్చున్న తర్వాత 'చెప్పు?' అన్నాడు.

'నా పేరు లలిత అండీ! నేను నరసింహంగారి కూతుర్ని' అంది.

'ఓ అలాగా!' అని 'మీ నాన్నగారు ఎవరినో పంపిస్తా అన్నారే?'

'నన్నేనండీ!' అంది లలిత.

## ప్రాక్టీసు పెట్టిచూడు

యీమెకు బాధ ఉంది అంటే నమ్మ బుద్ధికాలేదు. అయినా 'చెప్పు?' అన్నాడు.

'గుండెల్లో బాధండీ!' అంది.

అలాగా అంటూ స్టెతస్కోపు మెళ్ళో తగిలించుకుని లేచి దగ్గరకు వొచ్చేడు పరీక్షించేందుకు.

ఆమె సిగ్గుపడుతూ 'డాక్టర్ మీరు వొక ఆడపిల్లని యిలా రోడ్డు మీద నలుగురూ నడిచే త్రోవకు యెదురుగుండా పరీక్షిస్తే ఎలా చెప్పండి?'

తను చేసిన పొరపాటుకు 'సారీ' అని చెప్పి దిద్దుకుంటూ 'కర్టెను వెనక వెళ్ళి కూర్చో!' అన్నాడు.

ఆమె వెనుక తనూ వెళ్ళాడు. స్టెతస్కోప్ ఆమె గుండెల మీద పెట్టి దగ్గరగా నిలబడేటప్పటికి యింటిమేట్ సెంటు అతిగా తగులుతూంది. పరీక్ష తొందరగా ముగించి 'ఎక్కడేంటి నొప్పి?' అన్నాడు. ఆమె అరమోడ్పు కన్నులతో తన్ను చూస్తూ చేత్తో సున్నితంగా తన గుండె భాగాన్ని స్పృశిస్తూ 'యిక్కడ' అంది.

'అహా!' అని 'సరే రా మందిస్తాను' అన్నాడు.

ఆమె కొంచెం అసంతృప్తితో లేస్తూ 'డాక్టర్ నాకు యింజక్షను అంటే భయం - అది తప్పించి యింకేం అయినా యివ్వండి' అంది.

'సరే!' అని మూడు మాత్రలు యిచ్చి 'యిది యిప్పుడూ, మధ్యాహ్నం, సాయంత్రం వేసుకో' అన్నాడు.

'తగ్గకపోతే సాయంత్రం రానా' అంది.

'వొద్దమ్మా, రేపురా!' అన్నాడు.

ఆమె అసంతృప్తి చెందిన ముఖంతో వెళ్ళిపోయింది. ఆమె అలా ఎందుకు వెళ్ళిపోయిందో తనకు అర్థంకాలేదు. తను ఆ విషయం గురించి ఎక్కువ ఆలోచించనూ లేదు.

(ఇంకా వుంది.)

# వివా

## పగలూ రాత్రీ చేవనిచ్చే పానీయం

గతి శీలమైన నేటి ప్రపంచంలోని వత్తిడికి తట్టుకోవాలంటే,
చేవనిచ్చే వివా మీ కెంతో అవసరం.

**వివా రోజంతటికీ కావలసిన చేవను పెంపొందిస్తుంది!**

వివాలోని ఆధునికమైన సూత్రీకరణ మూలంగా, దీనిలో ఎక్కువ శక్తినిచ్చే 'మాల్ట్', 'డిమ్యా'ను పెంపొందించే ప్రోటీన్లూ ఉన్నాయి, ఇవి పనికి, ఆటకి కావలసిన శరీర శక్తిని పెంపొందిస్తాయి.

**వివా, ఖర్చయిన మీ శక్తిని భర్తీ చేస్తుంది రాత్రి పూట!**

పడుకోబోయే ముందు, వేడి వివా ఒక కప్పు తీసుకుంటే, అది మీకు సరియైన పద్ధతిలో నిద్ర పట్టేలా చేస్తుంది. మీరు ప్రొద్దున్న చలాకీగా, తాజాగా పుంజుకుని, నిద్ర లేచే దాకా పోషక శక్తిని సమకూరుస్తూనే ఉంటుంది!

వివా లేకుండా జీవితంలో యింత ఆనందం ఎక్కడుంటుంది గనక!

---

**వివా ఎక్కువ విలువ నిస్తుంది!**

ఒక్క బాటిల్ వివాని ఆరోగ్యాన్నిచ్చే మరే యితర పానీయంతోనైనా పోల్చి చూస్తే, యిది మరి ఎక్కువ కప్పుల పానీయాన్ని యిస్తుంది.

450 గ్రాములకు రూ. 11·56 మాత్రమే
(స్థానిక పన్నులు అదనం)

---

JIL జగత్‌జిత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్







ASP/JIL 2-79 TEL



# వంటలు

## ముల్లంగి పాఠోళీ

దీనినే తమిళదేశంలో "పు[illegible]" అనీ, ఆంధ్ర ప్రాంతంలో "పాఠోళీ" అనీ అంటారు.

కావలసిన వస్తువులు : ముల్లంగి - 2 (పెద్దవి), శనగపప్పు — 25 గ్రా, పచ్చిమిర్చి - 25 గ్రా, జీలకర్ర — కొదిగా, ఉల్లిగడ్డ — పెద్దది ఒకటి, డాల్డా లేక నూనె — 150 గ్రా, అల్లం చిన్న ముక్క.

తయారుచేయు విధానము :- తెల్లగా ఉన్న ముల్లంగి తీసుకొని కడిగి, పై పొట్టు చాకుతో గీకి, ఎండుకొబ్బరి కోరాముతో తురిమి పెట్టాలి. శనగపప్పు రాళ్ళు లేకుండా శుభ్రంచేసి రెండు గంటలు నీటిలో నానబెట్టాలి. నానినపప్పు కడిగి, రోటో వేసి కాస్త బరకగా నీరు ఎక్కువ చేర్చకుండా రుబ్బి తీయాలి. పచ్చిమిర్చి, జీలకర్ర, అల్లంముక్క బండతో దంచి తీసి పెట్టాలి. ఉల్లిగడ్డ చిన్న ముక్కలుగా తరిగి ఉంచాలి.

బాణలిలో సగం నూనె లేక డాల్డా వేసి, వేడెక్కాక, ఆవాలు, జీలకర్ర వేసి అవి చిటచిటలాడుతున్నప్పుడు ఉల్లిపాయ ముక్కలు వేసి కొద్దిగా వేగాక ముల్లంగి తురుము వేసి నీరు యిగిరేదాకా వేయించాలి. అది ముద్ద కాగానే విడిగా తీసి పెట్టుకోవాలి, మిగిలిన డాల్డా వేసి, దానిలో రుబ్బిన పిండి ముద్ద వేసి, తగినంత ఉప్పు, పసుపు చేర్చి కలిపి స్టౌ క్రింద సెగ తగ్గించి మూత పెట్టాలి. సన్నని సెగపై పిండి రొట్టెలా కాలుతుంది. దానిని అట్లకాడతో తిరగవేసి మరల మూత పెడితే పిండిలోని పచ్చి క్రమంగా తగ్గుతుంది. రెండవవైపు కూడా కాలాక అట్లకాడతో చిదిపి, దానిపై వేగిన ముల్లంగి ముద్దను కూడ వేసి, పచ్చిమిర్చి అల్లం ముద్ద కూడ చేర్చి, కలుపుతూ సన్నని సెగపై వేయించాలి. బాగా వేగి పొడిగా అయ్యాక కాస్త కొత్తిమీర తరిగి చల్లి దించుకుంటే, రుచిగా ఉంటుంది.

- కె. సీతామహాలక్ష్మి.

# దివ్యమైన తెలుపుకు
# ఒకే దారి

క్రొత్త ఫార్ములా

# డెట్

డిటర్జెంట్ ఉతికే పౌడర్




సాటిలేని ఉతుకు శక్తి,
అదనపు నురుగు,
తాజా సువాసన మరియు
దివ్యమైన తెలుపు!

## దివ్యమైన తెలుపు,
## డెట్ యొక్క తెలుపు

సీరియల్:

# సుదూర తీరాలు

పొత్తూరి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

మామూలుగా వుంటే, ఎంత మెత్తగా మృదువుగా మాట్లాడతాడు? ఒక్కోసారి కఠిన పాషాణంలా కనిపిస్తాడు. మరొకప్పుడు వెన్నముద్దలా కనిపిస్తాడు. ఏమైనా యింక నా జీవితానికి తనే దిక్కని తెలిసే యితనితో విరోధం నాకెందుకు?

మనసెలాగూ మాధవ్ బావ సొంతమే. యింక మనిషి ఎవరి సొంతమైతేనేం? మమతానురాగాల మనసూ, మాధుర్యమూ, మమతా అవి, నా మాధవకే పరిమితం. ఏవీ లేని పాషాణం. ఒట్టి శరీరం మాత్రమే నీకు సొంతం సూర్యం. నీకు కావలసిందంతేగా!

ఎందుకో అతనికి కావలసిందికూడా అంతే నాదనిపించింది మల్లికి. తను నిశ్చలంగా ఎదురుగా నుంచొనివుంటే, బాధగా చూసి దూరంగా జరిగిన సూర్యం ముఖం జ్ఞాపకం వచ్చింది. అదే యింకో క్షణమైతే ఆవేశంగా అక్కున చేర్చుకొని వుండేవాడే. కానీ తను నిర్వికారంగా నుంచునివుంటే దగ్గిరకు వచ్చి కూడా దూరం జరిగాడంటే... అతనికి కావలసిందేదైనా... దక్కేది మాత్రం మలిన మైన ఈ శరీరమే. అనుకుంటూ కూర్చుంది మల్లి.

"అమ్మగారూ! మిమ్మల్ని భోంచేసి పడుకోమన్నారు. అయ్యగారు ఆలశ్యంగా వస్తారంట. మీకు వడ్డించేయమంటారా?" అన్నాడు రాము.

"నాకో గ్లాసు పాలు తెచ్చిపెట్టు రామూ! ఆకలిగా లేదు" అంది మల్లి. టకటకా మెట్లు దిగివెళ్ళిన రామూ మరో పదిహేను నిముషాలలో ఓ ప్లేట్లో ద్రాక్ష, యాపిల్ ముక్కలూ మరో చేతిలో పాల గ్లాసు తీసుకొచ్చి టీపాయ్‌మీద పెట్టాడు

"అయ్యగారు ఆ పండ్లు తిని, పాలు తాగమన్నారమ్మా!" అన్నాడు వినయంగా. అయ్యగారి ఆజ్ఞమీద ఎంత గురి వాడికి.

"సరే నువ్వెళ్ళు" అంటూ వాడిని పంపేసింది మల్లి.

పాలు త్రాగి మంచంమీద పడుకుంది మల్లి. కొత్తగా కట్టుకున్న పసుపుతాడు మెడలో వున్న గొలుసుతోపాటుగా మెడకు దగ్గిరగా జారింది వురిలాగా. చిన్నగా నవ్వుకుంది మల్లి. అది వురిత్రాడు కాక మరేమిటి? ప్రక్కకు తిరిగి నిద్రపోవడానికి ప్రయత్నించింది. నిద్ర పట్టడంలేదు.

*     *     *

"రావోయ్ సూర్యం రా నీ కోసమే ఎదురు చూస్తున్నాం. పార్టీలో నువ్వు లేకపోతే పసందుగా లేదంటోంది మీ వసంత. నీ మరదల్ని యింట్లోనే పెట్టివచ్చావా! వెరీగుడ్. యింకో నైట్ ఆగి పంపిస్తాను కాంతీ అని ఫోన్ చేయకపోయావా, యిందుకోసం పనికట్టుకొని నువ్వు రావాలా? పోనీలే సమయానికి వచ్చావు మంచి సరుకొచ్చింది. యింపోర్టెడని పిల్లలంతా సరదా పడుతుంటే సరదాగా కూర్చున్నాం వసంతా ఆ గ్లాసందుకో" అంటూ హడావుడి పెట్టేసింది కాంతిమతి.

"ఏం చెప్పను? ఎంత ఘర్షణ అవుతుందో! ఎలా బయటపడతానో అనుకుంటూ వచ్చిన సూర్యానికి కాంతిమతి మామూలుగా మాట్లాడేసరికి సగం ధైర్యం వచ్చింది. ఈ రాత్రికి కూడా అవకాశమిచ్చింది కనుక ప్రొద్దుటే మల్లిని తీసుకొని వుడాయించేయవచ్చు దీనితో ఘర్షణపడే అవసరమే వుండదు" అని తనలో తానే సంతోషపడుతూ "ఇప్పుడేం వద్దు కాంతీ! యివ్వాళకూడా తీసుకురాకపోతే నువ్వేమనుకుంటావోనని చెప్పి వెళదామని వచ్చాను మల్లి ఒక్కతే వుంది నేను వెళతాను" అంటూ లేచిన సూర్యాన్ని చెయ్యిపట్టి లాగింది కాంతిమతి. ఆ వూపుకు వెళ్ళి ఆమె వళ్ళో పడ్డాడు సూర్యం. అక్కడ చేరిన అమ్మాయిలందరూ ఘొల్లున నవ్వారు.

తప్పనిసరిగా గ్లాసందుకున్న సూర్యం తెలివిలేకుండా అయ్యేవరకూ తాగుతూనే వున్నాడు. ఆఖరికి కాంతిమతి "యింక చాలు! ఎంత రామూ తోడున్నా, మల్లిక భయపడుతుందేమో వెళ్ళు" అంటూ సూర్యాన్ని బయటకు నెట్టింది.

మల్లి పేరు చెప్పగానే యిల్లు జ్ఞాపకం వచ్చింది. తూలుతూనే గబగబా అడుగులు వేస్తున్న సూర్యం తను రోడ్డుమధ్యగా నడుస్తున్నానన్న స్పృహలో లేడు

ఎదురుగా వస్తున్న లారీ నిర్దాక్షిణ్యంగా సూర్యాన్ని రోడ్డుకు అంకితంచేసి వెళ్ళిపోయింది. ఆపలేదు కూడా డ్రైవర్. అక్కడికక్కడే మరణించాడు సూర్యం అతని పాపాలన్నింటికీ ఒక్కసారి

***జరిగిన కథ-6 :*** స్కూలు మాస్టరు దశరథరామయ్యగారి కుమారుడు మాధవ్ ఓ కంపెనీలో మేనేజర్. వారింట్లో వంట చేస్తున్న అన్నపూర్ణమ్మ కూతురు మల్లిచే మాధవ్ తను వ్రాసిన పాటలు పాడించుకొంటూ పరస్పరానురాగబద్ధులవుతారు కాని అతని పల్లెటూరి వేషధారణ మాత్రం ఆమెకు నచ్చదు. మున్సబుగారు మాధవ్‌ను తన అల్లుడిగా చేసుకోవాలని పథకం వేస్తుంటాడు. మల్లిని మంచి గాయనిగా గుర్తించి తమ పిక్చర్‌లోని పాటలు పాడటానికి, గొప్ప గాయనిగా పేరు ప్రతిష్టలు పొందటానికి తనతో మద్రాసు రమ్మని అర్థిస్తాడు సూర్యం. అతని మాటలను నమ్మిన మల్లిక ఆ మరునాటి రాత్రి ఎవ్వరికీ చెప్పకుండా అతనితో వెళ్ళిపోతుంది. ఆ కారణంగా ఆమె తల్లి ఆ అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకొంటుంది. సూర్యం అసలు రంగు ఆమెకు అవగాహన అవుతూవుంటుంది. అతడు అందమైన అమ్మాయిలను ఆకర్షించి, తను అనుభవించి కాంతిమతికి అప్పచెప్తుంటాడు. అతను పన్నిన వలలో చిక్కుకున్న మల్లిని కూడా అనుభవిస్తాడు. కాని ఆమెకు అన్యాయం చెయ్యలేక వివాహానికి ఆమె అనుమతిని కోరతాడు. ఇక వేరే గత్యంతరం లేక తన మెడలో పసుపుకొమ్ము తనే కట్టుకొని సూర్యం కట్టినట్లుగా భావించుకొంటుంది మల్లి

# పెరుగుతున్న సంవత్సరాలు

# కాల్షియం-శాండోజ్® సంవత్సరాలు







పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి. విటమిన్ సి, డి మరియు బి$^{12}$తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్ళల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెపీలా సువాసన ఉంది

**కాల్షియం-శాండోజ్ స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్ వారు రూపొందించినది, ప్రపంచంలోని అత్యుత్తమమైన కాల్షియం.**




## కాల్షియం-శాండోజ్®

## గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం





ప్రాయశ్చిత్తం లభించింది కానీ మల్లి బ్రతుకు ఏంకావాలి ??

తెల్లవారే పాలకోసం, ఫ్లాస్క్ తీసుకొని బయలుదేరిన రాము తమ యింటికి దగ్గరలో రోడ్డుమీద జనం గుంపుగా నిలబడివుంటే, ఏమిటోనని చూసినవాడికి గుండెలు ఆగినంత పనైంది అయితే అక్కడేం మాట్లాడినా పోలీసులు వేసే యక్ష ప్రశ్నలకు సమాధానం చెప్పడం తనవల్లకాదని, వట్టి ఫ్లాస్క్ తీసుకొని యింటికి పరుగుతీశాడు.

ఏడుస్తూ జరిగిన ఘోరం గురించి, సూర్యం మరణం గురించి చెబుతున్న రాము వైపు నిర్వికారంగా చూసింది మల్లి. మనిషి వచ్చాడన్నా వులుకూ, పలుకూ లేకుండా కూర్చున్న మల్లిని చూసి వాడికి భయం మరింత ఎక్కువైంది. మల్లిని అలాగే యింట్లో వుంచి ఎందుకైనా మంచిదని యింటికి తాళం వేసి కాంతిమతి యింటికి పరుగెత్తాడు వార్త చెబుదామని.

అప్పటికే ఆ యింట్లో ఆ వార్త తెలిసి సూర్యానికి నిజంగా మనసిచ్చి మోసపోయిన వసంతా, పుష్ప శోకాలు పెట్టి ఏడుస్తుంటే... "నోళ్ళు ముయ్యండని" గద్దిస్తోంది కాంతిమతి

రాము పరుగున వెళ్ళడం చూసి వాడిని గదిలోకి పిలిచి ఏవో మంతనాలాడింది కాంతిమతి.

ఆమె చెప్పిన మాటలు విని రివ్వున వెళ్ళి టాక్సీ పిలుచుకువచ్చాడు రాము. అందులో ఎక్కి రాముని కూడా ఎక్కమని పోనియమంది. దగ్గరలోనే వున్న సూర్యం యింటికి చుట్టూ తిరిగి దొడ్డివాకిలి దగ్గర టాక్సీ ఆపించింది కాంతిమతి.

రాము దిగి చుట్టూ చూసి మూలకు వెళ్ళి గోడ అవతల దూకాడు తాళం తీసి మల్లికను తనతో రమ్మని దొడ్డిదోవన టాక్సీ దగ్గరకు తీసుకొచ్చాడు

మల్లి రాకపోతే తలమీద ఒక దెబ్బ వేసైనా, స్పృహ పోగొట్టైనా తీసుకు రమ్మంది కాంతిమతి

కానీ ఆ అవసరం లేకుండానే రామూ రమ్మనగానే మౌనంగా దిగి అతనితోపాటు దొడ్డిగుమ్మంగుండా బయటకు వచ్చి టాక్సీ ఎక్కింది మల్లిక. రాత్రి కట్టుకున్న పసుపుకొమ్ము గుండెలమీద అలాగే వుంది. తలలో ఎర్రగా మెరుస్తోంది కుంకుమ

ఒక్క క్షణం మల్లికవైపు చూసి అంతలోనే "త్వర పోనీయ్ మస్తాన్ ఎవరైనా వస్తారు" అంది డ్రైవర్‌తో. మళ్ళీ యింటికి తాళంవేసి వచ్చి డ్రైవర్

ప్రక్కన కూర్చున్నాడు రాముా గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి వాడికి

''ఏం జరుగుతుంది ? కాంతిమతి యిచ్చే డబ్బుకు కక్కుర్తిపడి తను యిక్కడి విషయాలన్నీ ఆవిడకు చెప్పకుండా వుండాల్సింది. రాత్రి పసుపుకొమ్ము కట్టారు సూర్యంగారు అన్న వార్త అందగానే అగ్గిమీద గుగ్గిలమైంది కాంతిమతిగారు

రాత్రి వాళ్ళింటికెళ్ళొస్తానని బయలుదేరి వెళ్ళిన అయ్యగారు రోడ్డుమీద లారీకిందపడి చరిగిపోయారు ఇందులో కాంతిమతి పాత్ర కూడా వుందనిపిస్తోంది. అది యాక్సిడెంట్ కాదు యాక్సిడెంట్ అవడానికి అవకాశం లేదు. అయ్యగార్ని, అంత దారుణంగా మరణించడం చూసి మొదట ఆశ్చర్యపోయి భయపడి కాంతిమతి దగ్గరికి పరుగెట్టిన వాడికి, కాంతిమతి ప్రవర్తన చాలా అనుమానం కలిగిస్తోంది మల్లికమ్మగారిని దక్కించుకోవాలనే అయ్యగార్ని అడ్డం తప్పించిందేమో, ఈ కాంతిమతమ్మ తనకు నిజంగా మతిలేదు ఆవిడ చెప్పినట్లు యిక్కడి వార్తలు ఎప్పటికప్పుడు అందిస్తే ఆవిడ డబ్బూ అప్పుడప్పుడూ మందూ, అందిస్తుందని కక్కుర్తిపడ్డాడే కానీ, అయ్యగారి ప్రాణాలు తీసేయడానికికూడా వెనుదీయదీ కాంతిమతి అని తెలిసివుంటే తను చచ్చినా ఆవిడకు వార్తలు అందజేసేవాడు కాదు

రాత్రి ఎంత కోసంగా మాట్లాడింది ? ''ఓహో సూర్యానికి పెళ్ళి కావలసివచ్చిందా? అయితే చేయవలసిందే. రోజులు దగ్గరకు వచ్చాయికనుకే యిలా విపరీతమైన బుద్ధులు పుడుతున్నాయి సరే నువ్వెళ్ళు'' అంటూ తన చేతిలో పది రూపాయలు పెట్టగానే తుర్రుమన్నాడు తను

తను వెళ్ళేసరికే అయ్యగారు డ్రస్ వేసుకొని ''కాంతిమతమ్మయింటికెళ్ళొస్తాను. మల్లికమ్మ ఒక్కరే వున్నారు జాగ్రత్త రాముా'' అని ఎప్పుడూలేంది జాగ్రత్త చెప్పి వెళ్ళారు. పాపం! తను జాగ్రత్త పడలేకపోయారు. తను మల్లికమ్మను ఈ రాక్షసిపాలు చేస్తున్నాడు. జరిగిందంతా పోలీసులకు చెప్పేస్తే... మల్లికమ్మను రక్షించవచ్చు ఇన్నాళ్ళూ అయ్యగారి వుప్పు తిన్నందుకు ఆఖరికి ఆయన ఋణం తీర్చుకున్నవాడినవుతాను.'' తీవ్రంగా ఆలోచిస్తున్న రాము టాక్సీ కాంతిమతి

# సుదూర తీరాలు

యింటిముందాగడం గమనించలేదు. కాంతిమతి దిగి తలుపునేసిన చప్పుడుకు వులిక్కిపడ్డాడు. సూర్యం జ్ఞాపకంతో వాడి కళ్ళలో నీళ్ళు సుళ్ళుతిరిగి వున్నాయి.

''పదండమ్మా!'' అంటూ మల్లికను టాక్సీ దింపి లోపలికి తీసుకెళ్ళాడు కాంతిమతి వాడినే గమనిస్తోంది. వెంటనే వెనక్కుతిరిగి ''నే వస్తానమ్మగారూ !'' అంటూ బయలుదేరాడు రాము.

తలవూపిన కాంతిమతి ప్రక్కనే వున్న కాశింని పిలిచి ''వాడిని వెంబడించు. ఏమాత్రం అనుమానం కలిగినా వెనకా ముందూ ఆలోచించకుండా బుర్ర బద్దలు కొట్టేయ్'' అంటూ పంపింది

వడివడిగా పోలీస్ స్టేషన్ వైపుగా వెళుతున్న రాముా ప్రయత్నం అర్థమైంది కాశింకి వాడికి పదిగజాల దూరంలో అనుసరిస్తున్నాడు వాడి అనుమానం నిజమని తెలీగానే, బిగ్గరగా కేకేశాడు,

''రామూ' అమ్మగారు పిలుస్తున్నారురా !'' అంటూ

బిక్కుబిక్కుమంటూ ఆగి చూశాడు రాము.

సర్రున దూసుకొచ్చింది మస్తాన్ టాక్సీ. ''ఎక్కరా'' అన్నాడు కాశిం.

''ఎందుకు?'' అన్నాడు రాము భయంగా

''ఎక్కుబే! అమ్మ నీకో పని చెప్పమని చెప్పారు. అడయార్ వెళ్ళిరావాలి. దారిలో చెబుతలే పనేంటో'' అంటూ రాముని మస్తాన్ ప్రక్కకు తోసి తను ప్రక్కనే కూర్చున్నాడు.

టాక్సీ అడయార్ ప్రక్క దూసుకుపోయింది. ఇలియట్స్ బీచ్ పరిసరాల్లోకి వచ్చిన తర్వాత మనుష్య సంచారం లేనిచోట చూసి టాక్సీ దిగి,

''దిగుబే జల్దీ !'' అంటూ రామూని ఒక్కలాగులాగాడు కాశిం ఆ వూపుకు వెళ్ళి ఇసకలో పడ్డాడు రాము.

వెంటనే టాక్సీలోనించి యినపరాడ్ తీసుకొని గట్టిగా రెండుదెబ్బలు బుర్రమీద వేసి,

''పదరా మస్తాన్!'' అంటూ కారెక్కి కూచున్నాడు కాశిం

టాక్సీ ఆఘమేఘాలమీద టి నగర్ వైపు సాగిపోయింది.

తల బద్దలైన రామూ ఎప్పుడో బ్రతికాడో చూసుకోలేదు వాడు అంత పెద్ద దెబ్బలు తగిలిన తర్వాత వాడు బ్రతకడం అసంభవం బ్రతికినా మామూలు మనిషిగా వుండడు తప్పకుండా ఏ పిచ్చో ఎక్కుతుంది లేకపోతే గత జీవితాన్ని మరిచిపోతాడు అది కాశిం దెబ్బలోవున్న మహత్యం. అందుకే అంత నిర్భయంగా వదిలేసి వెళ్ళిపోయారు ఇంక వాడివల్ల ఏ ప్రమాదం వుండదు.

కిరాయి మనుషులు కిరాయి మనుషుల చేతుల్లోనే చస్తారనే మామూలు మాత్రం తెలియక కాంతిమతికి, కిరాయి పని చేశాడు రాము. అందుకు యజమానితోపాటు తనూ అనుభవించాడు.






## మకరందానందం!



కన్సొలేషన్ బహుమతి పొందిన చిత్రం. — ఎస్. సురేష్‌కుమార్.

# సుదూర తీరాలు

ఆ సాయంత్రం వస్తామని కబురుచేసిన కుమార్‌బాబుకు అంతక్రితమే మల్లిని గురించి చెప్పివుండడంవల్ల మల్లిని లేపి స్నానంచేయించి రెడీచేయ్యమని వసంతకు పురమాయించింది కాంతిమతి

మల్లిక వుంచిన గదిలోకి వెళ్ళిన వసంతకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అది గెస్ట్ రూమ్. మల్లిక రాగానే తనను వున్న రూమ్‌లో సర్దుకొమ్మని చెప్పింది అప్పటకు ఉన్నవాటిలో ఆ రూమే ఆడంబరంగా సెట్‌గా వుంటుంది నెమ్మదిగా మల్లిక దగ్గిర కెళ్ళి ''స్నానంచేయి మల్లికా'' అంది

మల్లిక సూర్యాన్ని పెళ్ళి చేసుకుందని, అందుకే కాంతిమతి సూర్యాన్ని తెల్లవారి పాటికి నామరూపాలులేకుండా చేసిందని తెలిసింది వసంతకు ఆ ఇల్లు దాటి బయట ప్రపంచంలోకి వెళ్ళి బ్రతకడం అసంభవమని తెలుసుకున్న దగ్గిరనుంచీ ఆ రాక్షసి మాటకు కట్టుబడి దాని అభిమానానికి పాత్రురాలైంది వసంత కానీ కాంతిమతి అంటే దాని డబ్బు కక్కుర్తంటే, ఎనలేని అసహ్యం ఎంత అసహ్యమంటే, తనవా నరకకూపానికి తెచ్చిన సూర్యం మీద కూడా అంతటి ద్వేషం, అసహ్యం లేవు పైగా అతనిమీద జాలి వుంది. ఆలాతప్ప బ్రతకలేని అతని అసమర్థతను తెలుసుకొని బాధపడేది. సూర్యాన్ని మనస్పూర్తిగా ప్రేమించి అతనితో వచ్చేసింది వసంత. సినిమా ప్రలోభం అతను పెట్టినా, అతని ప్రేమ ప్రలోభానికే లొంగింది సూర్యానికి కూడా వసంతంటే ఓ ప్రత్యేకమైన అభిమానముంది. అందుకే అతని మరణం వసంత మీద చాలా పెద్ద దెబ్బే తీసింది. మళ్ళీ ఈ మల్లికను కూడా తనలో కలిపేస్తుంది మరికొన్ని గంటలలో ఆ భావం మనసులోకి రాగానే మల్లికవైపు జాలిగా చూసింది వసంత. కాంతిమతిని నిలువునా ఉప్పుపాతర పెట్టినా పాపంలేదని పించింది.

మల్లిక దగ్గరగా వెళ్ళి గడ్డం పట్టుకొని పైకి లేపుతూ,

''మల్లికా! సూర్యం చనిపోయాడు నీకు బాధగాలేదూ! అసలు మాట్లాడవేం. ప్రొద్దుటినుంచీ అలాగే వున్నావు అసలీ విషయం నీకు చెప్పారా లేదా!'' అడుగుతున్న వసంత కళ్ళవెంట టప్ టప్ మని జారి పడ్డాయి కన్నీళ్ళు

''సూర్యం చచ్చిపోతే బాధపడట మెందుకూ? చచ్చిపోయాడంటే బ్రతికి పోయాడన్నమాట! ఏడుస్తావెందుకు?'' అంటున్న మల్లిక మనసు బాగా గాయపడి వుందని అర్థమైంది వసంతకు

మరేం మాట్లాడకుండా కళ్ళు తుడుచుకొని టవల్ తీసుకొని తన పెట్టెలో నుంచి బట్టలు తీసి మల్లికను స్నానానికి పంపింది. ఎలాగో స్నానంచేసి వచ్చింది మల్లిక

పనులన్నీ యాంత్రికంగా చేస్తున్నా మెదడులో ఏదో భాగం స్తంభించిపోయి నట్లుగా వుంది మల్లి ప్రవర్తన, అనుకుంది వసంత అక్కడే కూర్చుని మల్లికనే పరీక్షగా చూస్తూ మెడిసన్ చదవాలని ఒక్క సంవత్సరం పూర్తిగాకుండానే సూర్యం ప్రేమపిచ్చిలో పడి చదువూ కాలేజీ, తన మీద ఆశలు పెట్టుకున్న తండ్రినీ వదిలి మద్రాసు వచ్చేసిన వసంత, ఆమాత్రం మల్లిక మానసిక అవస్థను గురించి గెస్ చేయగలిగిందంటే అది వసంతలో వున్న జ్ఞాన తృష్ణకు నిదర్శనమే అనుకోవాలి

మెడిసన్ చదవలేకపోయినా మెడికల్






# ఎల్లప్పుడు చైతన్యంగా ఎల్లప్పుడు చురుకుగా

మీ బాబు పెరుగుతున్నప్పుడు, అతను నిరంతరం అదనంగా శక్తి వినియోగిస్తూ ఉంటాడు.

మీ బాబుకు శక్తినిచ్చే రుచికరమైన, పాలతో తయారైన మాల్ట్ చాకొలెట్ పానీయం బూస్ట్ ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్ మరియు కొకో తో తయారైనది.

మీ బిడ్డకు శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి. అది అతను రోజంతా, ప్రతీ రోజు కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్టు చేస్తుంది.






B-5621 T 4

## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

## బూస్ట్

మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

జర్నలిస్టు తెప్పించుకొని చదువుతుంది అన్నీ తెలిసే అలా ఎందుకు బ్రతుకుతుందంటే, విధిలేక అనే చెప్పవలసివస్తుంది సమాధానం. అక్కడినుంచి పారిపోయినా తనకు రక్షణలేదని తెలుసుకుంది గనుక, అని చెప్పాలి.

చిన్నగా నవ్వుతూ మల్లికను డ్రెస్సింగ్ టేబుల్ దగ్గిరకు తీసుకెళ్ళింది వసంత. కావాలనే పసుపుకొమ్ము కట్టిన తాడు తీసి పవిట పైకి వేసింది. అద్దంలో తనను తాను చూసుకున్న మల్లిలో ఏదో అలజడి బయలుదేరింది. వెంటనే తన పెట్టెలో భద్రంగా దాచుకున్న సూర్యం ఫోటో తీసుకొచ్చి చూపించింది వసంత. దానివల్ల ఏదైనా ప్రయోజనముంటుందని కాదు. ఏదో చిన్న టెస్ట్ చేసి చూస్తే పోయేదేముంది? అని.

ఓ క్షణం ఆ ఫోటోవైపు, మరుక్షణం తన మెళ్ళో తాడువైపు, తన పాపిట ఎర్రగా మెరుస్తున్న కుంకుమవైపు మార్చి మార్చి చూసిన మల్లి, వెంటనే మెళ్ళో నుంచి పసుపుకొమ్ము తీసివేసింది టవల్ తీసుకుని పాపిట్లో వున్న కుంకుమ చెరిపేసింది. ఒంతమాత్రానికే ఏదో సాధించినట్లు సంబరపడింది వసంత

"మల్లికా! నేనెవరో తెలుసా?" అంది వసంత.

"ఎవరు? నేనిక్కడకు ఎలా వచ్చాను? సూర్యం వచ్చిపోయాడుకదూ?" అంటూ ప్రశ్నమీద ప్రశ్న వేసింది వసంతను.

వసంత జరిగిందంతా చెప్పింది. ఆరోజు జరగబోయే ప్రమాదం గురించి కూడా చెప్పింది

మల్లిక నిర్లిప్తంగా నవ్వింది. "ఎన్ని మలుపులు తిరిగింది జీవితం? మరెన్ని మలుపులు తిరగాల్సివుందో! ఈ ప్రమాదం నుంచి నన్ను తప్పించలేవా వసంతా!" అంది మల్లిక వసంత చేతులు పట్టుకుంటూ

"క్షమించు మల్లికా! ఈ విషయంలో నే నశక్తురాలిని అయితే నీకు తప్పించుకోడానికి ఒక మార్గం వుంది కుమార్‌బాబు యిక్కడ వుండరు. ఆయన గెస్ట్‌హౌస్‌కు తీసుకెళతారు. అక్కడికి ఆయనతోపాటు ఆయన కోరుకున్న అమ్మాయితప్ప మరొకళ్ళు రావడానికి వప్పుకోరు. అక్కడినుంచి నువ్వు తెలివిగా తప్పుకోగలిగితే బ్రతికిపోతావు. అయితే చాలా తెలివిగా వ్యవహరించాలి

# సుదూర తీరాలు

అతనికి త్రాగుడు అలవాటుంది. సాధ్యమైనంత ఎక్కువగా త్రాగించావంటే, అతన్ని నిద్రపుచ్చి నువ్వు తప్పుకోవచ్చు. అంతకంటే వేరే మార్గంలేదు. నీ విషయంలో ఎవరినైనా తోడు పంపిస్తానంటుందేమో! దానికి, ఎప్పుడేం బుద్ధిపుడుతుందో చెప్పడం కష్టం. ముందు నువ్వు మామూలుగా తయారవ్వాలి

## నిరీక్షణ

నిరీక్షణే జీవం
నిరీక్షణే ప్రాణం
నగటు మనిషికి ఆధారం
నిరీక్షణే నిరీక్షణే

కాలేజీ సీటుకై
విద్యార్థి నిరీక్షణ
ఎంప్లాయ్‌మెంటు కాలకై
నిరుద్యోగి నిరీక్షణ
వర్షపు మేఘానికై
కర్షకుని నిరీక్షణ
బోనసు డబ్బులకోసం
కార్మికుని నిరీక్షణ
కట్నం కోరని వరునికై
కన్నెపిల్ల నిరీక్షణ
అతను చంపు నిరీక్షణ
విరాళ గొల్పు నిరీక్షణ
ఎన్నాళ్ళీ నిరీక్షణ
ఎన్నేళ్ళు ఈ నిరీక్షణ

— ఆర్. యస్. రావు.

ప్రొద్దుటిలాగే మౌనంగా వుండిపో. అప్పుడు నువ్వు ఎక్కడికీ పారిపోవన్న నమ్మకం కలుగుతుంది చెప్పింది చేస్తున్నట్లుగా కనిపించాలి. ఈలోపు నేనూ కొంత కథ అల్లుతాను. వస్తాను. మరీ ఎక్కువసేపుంటే, ఆ రాక్షసికి అనుమానమొస్తుంది. జడ వేసుకొని బొట్టు, కాటుకా ... తప్పదు పెట్టుకో నాటకం ఆడకపోతే కష్టం" అంటూ త్వరత్వరగా వెళ్ళిపోయింది వసంత.

తను సూర్యం పేరు చెప్పి పసుపుకొమ్ము



కట్టుకున్న క్షణం ఎంతటి పాపిష్టి క్షణం. కొన్నిగంటల వ్యవధిలోనే అతన్ని మింగేసింది దుష్టుడో, దుర్మార్గుడో, అతనితోనే యిక జీవితకాలమంతా గడపాలనే నిర్ణయానికి వచ్చిన కొన్ని గంటల్లో అతను దూరమైపోవడం ఎంతటి దురదృష్టం!...

పెళ్ళి కాకుండానే అతని భార్య కావడం, పెళ్ళికాని పెళ్ళి, అయిందనుకున్న మరుక్షణం అతని విధవ కావడం నిజంగా తన జీవితం యింత కొద్ది వ్యవధిలో ఎన్ని మలుపులు తిరిగింది? మాధవ్ ఎక్కడున్నావు? నీ మల్లి బ్రతుకు ముళ్ళకంచెల నడుమ పడి, తునాతునకలైపోతుంటే నువ్వు రాలేవని తెలిసినా నీకోసం అనుక్షణం ఎదురు చూస్తోంది మనస్సు. నన్ను వెతికే ప్రయత్నమైనా చేశావో లేదో! నిన్ను మట్టుకు నా వూపిరున్నంతవరకూ నా గుండెల్లో మ్రోగే ప్రతిస్పందనతో తలుచుకుంటూనే వుంటాను. నన్ను తీసుకువచ్చి మృత్యువునే కొని తెచ్చుకున్నట్లైంది సూర్యం.

ఇంతకాలం దుర్మార్గంగావున్నా ప్రపంచం అతన్నేమీ అనలేదు. గౌరవంగానే చూసింది మామూలు మనిషిగా బ్రతకాలనుకున్న మరుక్షణం మరణం అతన్ని వరించింది

మానవుడు దానవుడుగా మసిలినంతకాలం గౌరవించిన సమాజం, దానవుడు మానవుడుగా మారే పరివర్తనను సహించలేదు ఆ ప్రయత్నంలో అతని ప్రాణాలే బలికావడం సాధారణంగా జరుగుతుంటుంది. అదే అభాగ్యుడు సూర్యం విషయంలో నూ జరిగింది. అతని ప్రయత్నం ఆదిలోనే తుంచివేసింది కాంతిమతి.

*(ఇంకా వుంది)*

అనివార్య కారణాలవల్ల 'బొమ్మల భారతం' యీ వారం పడలేదు. పైవారం వేస్తాము. —సం:

# సినిమా విశేషాలు -జి. వి. జి.

**ధనలక్ష్మి పిలిచిందిలో**
**హమ్మనే గిరిజ**

గోపాల్ (నూతన్‌ప్రసాద్) ముసుగు బిగతన్ని మూడంకె వేసి పడుకొనుంటే గిరిజ (జయరేఖ) వచ్చి తట్టి లేపింది "డార్లింగ్! ప్లీజ్, గెటప్!"

"ఓ మై లవ్‌లీ! అప్పుడే తెల్లవారిందా?"

"ఇరవై నాలుగ్గంటలూ యిలా పడుకొని వుంటే, మన బ్రతుకు తెల్లవారేదెప్పుడు?"

"అబ్బా! ఈ ఇండియన్ కల్చర్‌తో నన్ను చంపుతున్నావు"

"అమెరికా వెళ్లివచ్చినంత మాత్రాన యిలా పాడైపోవాలా?"

"అమ్మమ్మా! అది నా తప్పు కాదు — మీ అబ్బాది 'అల్లుడూ, మనకేమిటి లోటు?' అన్నాడు అంతే ఉద్యోగానికి తిలోదకాలు ఇచ్చాం అత్తారింట్లో హాయిగా సకలభోగాలూ అనుభవిస్తున్నాం"

"ఇలా సమాధిలో కూర్చుండిపోయారు పాపం — ఎన్నిరోజులిలా?"

"పూర్తి కట్నం ఇచ్చి పంపేంతవరకు"

"ఇవ్వకపోతే?"

"ఇక మీద విస్కీతో స్నానం చేస్తూ కూర్చుంటాను"

"అంతవరకు అవసరంలేదుగాని, ఈ కాఫీ తీసుకోండి మిమ్మల్ని తొందరగా ఇంటి నుంచి పంపించే ఏర్పాట్లు నేను చేస్తాను లేకపోతే, అందర్నీ తాగేసేటట్టుగా వున్నారు!" అంటున్న భార్యవంక నిర్లక్ష్యంగా చూస్తూ, విస్కీబాటిల్ అందుకున్నాడు గోపాల్

ఉమాకాంత్ ఆర్ట్స్ పిక్చర్స్ "ధనలక్ష్మి పిలిచింది" చిత్రాన్ని రాజవర్ధన్ దర్శకత్వంలో ఎం శంకరరెడ్డి నిర్మిస్తున్నారు

**"ఈ కాలం కథ"**

నిర్మాత శ్రీమతి టి జె రాజారెడ్డి కథ ఆధారంగా తయారయ్యే శ్రీ శుభోదయా ఆర్ట్స్ పిక్చర్స్ చిత్రంలో ఈశ్వరరావు, ఎం విజయలక్ష్మి, సాక్షి రంగారావు, సి హెచ్ కృష్ణమూర్తి, చిట్టిబాబు, పొట్టిప్రసాద్, మురళి బాలసరస్వతి, పుష్పకుమారి, రత్నాంజలి, బేబీరాణి, డైరెక్టర్ రాజా శ్రీధర్ పాత్రధారులు శ్రీకాంత్, సత్యం, సుఖదేవ్, లీలాకృష్ణ రచన, సంగీతం, ఛాయ, శిల్పం శాఖలను నిర్వహిస్తున్నారు సహాయ నిర్మాతలు బి నరసింహారెడ్డి, సి హెచ్ మోహనరావు, జాటూరు రామకృష్ణారెడ్డి

విశ్వవిఖ్యాత నటసార్వభౌమ. నటరత్న,
డా॥ యన్.టి. రామారావు నటించిన
సత్యత్రాంయ్ ప్రొడక్షన్స్

# శృంగార రాముడు

కలర్

దర్శకత్వం: కె. శంకర్




ఆంధ్ర: తారకరామ
సీడెడ్: నవభారత్
మైసూర్: అజంతామూవీస్,
Vayada

# సినిమా విశేషాలు

## "శృంగార రాముడు" గురించి కె. శంకర్

1938లో ఎడిటర్‌గా సినిమా రంగంలో ప్రవేశించిన కె. శంకర్ కొన్ని వందల చిత్రాలకు సంకలనం చేశారు. ఎ వి ఎం సంస్థలో పని చేస్తున్నప్పుడు "భూకైలాస్" తెలుగు చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశం లభించింది. ఆ తర్వాత ఎ వి ఎం సంస్థ నుండి బొంబాయి వెళ్ళి కొన్ని హిందీ చిత్రాలకు దర్శకత్వం నెరిపారు. "జూలా, బరోసా, రాజ్‌కుమార్, పరదేశీ పీఛే, రిక్షావాలా," లాంటి దాదాపు పదిహేను చిత్రాలను డైరెక్ట్ చేశారు. యోగితాబాలి, వినోద్‌మెహ్రా లాంటి నటీనటులను తొలిసారిగా పరిచయం చేసిన ఘనత ఈయనదే.

తెలుగు, హిందీ చిత్రాలేకాక తమిళం (యం జి ఆర్), కన్నడం (రాజ్‌కుమార్), మలయాళం (ప్రేంనజీర్) — ఆయా భాషల్లో అగ్రశ్రేణి నటులు ధరించిన చిత్రాలను డైరెక్ట్ చేశారు.

ఎ ఎన్ ఆర్, ఎన్ టి ఆర్ నటించిన 'భూకైలాస్" తర్వాత 24 ఏళ్ళకు మళ్ళీ తెలుగులో "శృంగార రాముడు" చిత్రాన్ని ఎన్ టి ఆర్‌తో తీసే భాగ్యం కలిగిందన్నారు శంకర్.

"అప్పటికీ, ఇప్పటికీ ఆ మహానటునిలో తేడా ఏమైనా మీకు కనిపించిందా?" అని అడిగాము.

"నిజం చెప్పాలంటే — దాదాపు అన్ని విషయాలలోను అందరిలోను నాకు మార్పు కనిపిస్తూందే గాని, ఎన్ టి ఆర్. గారి క్రమశిక్షణలోగాని, నటనపట్ల వారికున్న శ్రద్ధాసక్తులలోగాని ఏమాత్రం మార్పు కనిపించలేదు," అన్నారు శంకర్.

"కొన్ని ఉదాహరణలు చెప్పగలరా?"

"భూకైలాస్ — చిత్రంలో రావణాసురుడు తపస్సు చేసే ఘట్టంలో — పెరిగిన పుట్టమధ్య బాగా పెరిగిన గడ్డం, మీసాల మేకప్‌తో షూటింగ్ ముగిసేవరకు అలాగే నటనానిష్టలో నిమగ్నులై కూర్చుండిపోయారు. 'మేకప్ తీసేసి మళ్ళీ వేసుకో వచ్చు. భోజనానికి రండి,' అని ఎంతమంది కోరినా లేచి రాకుండా పానీయాలు మాత్రం సేవిస్తూ, ఉపవాసం ఉండిపోయారు. ఆ రామారావుగారే ఇటీవల కాశ్మీర్‌లో మా 'శృంగార రాముడు' షూటింగప్పుడు మంచును కూడా ఖాతరు చేయక వేకువజామున మూడు గంటలకే నిద్రలేచి, అయిదు గంటలకల్లా షూటింగ్‌కు సిద్ధమవుతూంటే మేమంతా ఆశ్చర్యపోయాం. ఎంత నిష్ఠ! ఎంత క్రమశిక్షణ! ఎంతమంది ఇలా నియమంతో ఉండగలరు? నటనను తపస్సుగా భావించే ఆయనకు నా జోహార్లు! ఇంకొక ఉదాహరణ చెప్తాను. ఈనాడు డబ్బింగ్‌కు వచ్చే ఆర్టిస్టులు ఒక లూప్ చెప్పేలోగా నాలుగైదుసార్లు కూర్చొని లేస్తారు. ఇటీవల మా 'శృంగార రాముడు' చిత్రానికి బెంగళూరులో డబ్బింగ్ ఏర్పాటు చేసినప్పుడు సాయంత్రం ఆరు గంటలకు వచ్చిన రామారావుగారు ఒక్క నిమిషమైనా కాలహరణం కాకుండా, మధ్యలో విశ్రమించకుండా రెండున్నర గంటలసేపు ఏకధాటిగా డబ్బింగ్ చెప్పారు. అలా రెండు రోజుల్లోనే పూర్తిచేయగలిగాం. ఆయన దీక్షకు, శ్రద్ధకు అక్కడున్నవారంతా చకితులయ్యారు. అంతటి దీక్షాదక్షత ఇంతవరకు నేను

'సీతే రాముడైతే'లో శ్రీధర్, జయసుధ



చూడలేదు. ఆ సహకారం వల్లనే మేమెంతో ఉత్సాహంతో 'శృంగార రాముడు' చిత్రాన్ని ఆశించినంతకన్నా మిన్నగా తీశాం. ఒక చిన్న సన్నివేశమైనా నిర్మాతకు నచ్చకపోతే నేను కాంప్రమైజ్ కాను. 'మంచుకొండమీద శివుడు నాట్యమాడినాడు' అనే చరణం చిత్రీకరణ కోసం కాశ్మీర్‌కు 73 మైళ్ళ దూరంలో ఉన్న సోనామార్గ్ అనే మంచు ప్రదేశానికి వెళ్ళాం. అనుకున్న ఫలితం సాధించాం. మంచుమీద పోరాటం రీ రికార్డింగ్ కోసం 2 వేన్‌ల నిండా మంచుగడ్డలను తెప్పించి, థియేటర్‌వారి సాయంతో ఐస్ ఫైటింగ్ ఎఫెక్ట్‌ను ఎక్కువగా తీసుకురాగలిగాం. రీ రికార్డింగ్ కోసమే యాభై వేలకు పైగా ఖర్చయింది. డబ్బు ఖర్చుపెట్టే విషయంలో మా సత్యసాయి ప్రొడక్షన్స్‌వారు ఎక్కడా రాజీపడలేదు. కాశ్మీర్‌లో ఫైట్స్‌తోపాటు ఐదు పాటలు చిత్రీకరించాం. ఎన్. టి. రామారావుగారి సహకారాన్ని, ప్రోత్సాహాన్నీ మేం మరవలేం. ఆయన కాల్‌షీట్లు ఇవ్వగానే సత్యసాయి ప్రొడక్షన్స్‌వారి తదుపరి చిత్రాన్ని ప్రారంభిస్తాం," అన్నారు శంకర్.

### మరికొన్ని చిత్రాల పేర్లు

ఎన్. టి. ఆర్., శ్రీదేవి జంటతో కె. వాసు దర్శకత్వంలో రియాజ్ భాషా నిర్మించే షైన్ ఎంటర్‌ప్రైజెస్ ద్వితీయ చిత్రం "సరదా రాముడు"

పురాణదాసన్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి సారంగన్ నిర్మించే గంగసారంగా ఫిలిమ్స్ వన్నెల చిత్రానికి "ఇదే నా సవాల్" అని పేరు పెట్టారు.

శిరం లక్ష్మణరావు సమర్పణలో ఎస్ విజయలక్ష్మి, పి ఎన్ కృష్ణ నిర్మించే చిత్రం "రక్తబంధం" ఈ చిత్రానికి ప్రప్రథమంగా కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్న ఆర్యూరి రవికి చి॥ సౌ॥ సీతామహాలక్ష్మితో నవంబర్ 9న తెనాలిలో వివాహం జరిగింది.

'పరోపకారి పాపన్న'లో



# సినిమా విశేషాలు

## "శివమెత్తిన సత్యం"లో రాధ చెప్పిన సత్యం

రాజాకు రాధ అన్నం తినిపిస్తుండగా మోహన్ వచ్చాడు. అతన్ని చూడగానే రాధ లేచి "ఏమిటిలా వచ్చారు ?" అంది.

"ఏం లేదు. మీరెలా ఉన్నారో, ఏమో విచారిద్దామని —"

"అయ్యో, పాపం! ఎంత దయ! ఇల్లు తగులబెట్టి, చల్లగా ఉండమని దీవించాడట నీలాంటి పెద్దమనిషి."

"జరిగింది మరిచిపోండి."

"ఎలా మరుస్తాం? పల్లెటూళ్ళో పడున్న ఆయన్ని ఆశపెట్టి, పట్నం పిలిపించారు. అమాయకుడ్ని చేసి, ఎర వేసి ఇరికించి, జైలుకు పంపారు. మచ్చలేని ఆయన జీవితంలో మాసిపోని మచ్చ వేశారు. పెళ్ళి కావాల్సిన ఆయన చెల్లెలి జీవితాన్ని మంటకలిపారు. మరచిపోయేవా ఇవన్నీ ?"

"చూడండి. మా వ్యాపారమే అలాంటిది. కొందరు జైలుకు వెళ్లడం, రావడం మామూలు. మేము వాళ్ళ కుటుంబాల మంచీ చెడూ చూసుకోవడమూ మామూలే. రెండేళ్ళు — కళ్ళు మూసి తెరిచేలోగా గడిచిపోతాయి. అందాకా ఇది



జయసుధ, రామారావు 'యుగంధర్'లో



ఈశ్వరరావు, కె. విజయ

ఉంచుకోండి," అంటూ మోహన్ డబ్బు ఇవ్వబోయాడు.

"అక్కర్లేదు. మీ పాపిష్టి డబ్బుతో ఈ గతి పట్టింది మాకు. మమ్మల్నిలా బ్రతకనివ్వండి. వెళ్ళండి. ఇంకెప్పుడూ ఈ గుమ్మం తొక్కకండి!"

"ఆవేశంలో అంటున్నారుగాని, అవసరాలూ-ఇబ్బందులూ..." అంటూ గొణిగాడు మోహన్.

"కష్టాలిచ్చిన దేవుడు వాటిని భరించే శక్తి కూడా ఇస్తాడు. మీ సహాయం అనవసరం!" అని రాధ (శారద) చెప్పేసరికి మోహన్ (ప్రసాద్‌బాబు) తిరుగుముఖం పెట్టక తప్పిందికాదు.

కృష్ణంరాజు ప్రధాన పాత్ర ధరిస్తూ నిర్మించే రాధాకృష్ణ మూవీస్ "శివమెత్తిన సత్యం" వర్ణ చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకుడు. ఆత్రేయ రచయిత. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు. జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు. యు. వి. సూర్యనారాయణరాజు నేతృత్వంలో జి. సత్యనారాయణరాజు నిర్మాత.

### సుశీల

రతీదేవి, ఈశ్వరరావు, ప్రభాకరరెడ్డి, ప్రసాద్‌బాబు, త్యాగరాజు, మధుబాబు, హలం మున్నగువారు పాల్గొనే ఆర్. ఆర్. ప్రొడక్షన్స్ "సుశీల" చిత్రాన్ని పి. దుర్గాప్రసాద్ దర్శకత్వంలో హరికెట్టి సమర్పిస్తున్నారు. పేరాల సుబ్రహ్మణ్యం రచయిత. వి. ఎస్. ఆర్. కృష్ణారావు ఛాయాగ్రాహకుడు. సత్యం సంగీత దర్శకుడు. నిర్వహణ : రామ్‌కే.

### మోసగాడు

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో క్రాంతికుమార్ నిర్మించే శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజెస్ "మోసగాడు" వర్ణచిత్రంలో శోభన్‌బాబు, శ్రీదేవి, సత్యనారాయణ, చిరంజీవి, గుమ్మడి, రోజారమణి, నిర్మల వగైరా తారాగణం. సత్యానంద్, చక్రవర్తి, కె. ఎస్. ప్రకాష్, భాస్కరరాజు, కోటగిరి వెంకటేశ్వరరావు వగైరా సాంకేతికవర్గం. తొలి షెడ్యూల్ అక్టోబర్ 23 నుంచి 31 వరకు జరిగింది.

### సత్యానంద్ – జంధ్యాల

"నిండు నూరేళ్ళు, బుర్రిపాలెం బుల్లోడు" చిత్రాలతోపాటు ఠాగూర్ ఆర్ట్స్, తిరుపతి ఇంటర్నేషనల్, విజయలక్ష్మి ఆర్ట్స్, రామకృష్ణ సినీ స్టూడియోస్, అన్నపూర్ణ స్టూడియోస్ వారి చిత్రాలకు, గోపాలకృష్ణ, చలసాని గోపి నిర్మించే చిత్రాలకు కథలు సమకూర్చిన సత్యానంద్ — జంధ్యాల నవంబర్ 10న 'హోటల్ సవేరా'లో పాత్రికేయుల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. తాము కథలు సృష్టించిన చిత్రాలకు సంభాషణలు మాత్రం ఇద్దరిలో ఎవరో ఒకరు రాస్తున్నట్లు తెలియజేశారు. ఇతర భాషా చిత్ర కథలపై నిర్మాతలు ఆధారపడకుండా వుండడానికి తామీ సంయుక్త రచనకు పూనుకున్నట్లు చెప్పారు. ఇందుకు ముందు వారు కథ రాసిన "బుర్రిపాలెం బుల్లోడు", అనంతరం "నిండు నూరేళ్ళు" వర్ణచిత్రాలు ప్రదర్శింపబడ్డాయి.

### ప్రియబాంధవి

త్వరలో విడుదలయ్యే శ్రీపతి ఫిలిమ్స్ "ప్రియబాంధవి" చిత్రాన్ని రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారు నవంబర్ 1న తిలకించి ప్రశంసించారని నిర్మాత శ్రీపతిరావు నవంబర్ 9న పాత్రికేయుల సమావేశంలో తెలియజేశారు.

### తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్‌ల అసోసియేషన్

1979–80 సంవత్సరానికి తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్‌ల సంఘం ఎన్నికలు నవంబర్ 11న జరిగాయి. అధ్యక్షుడు : మోహన్‌కుమార్. ఉపాధ్యక్షుడు : బి. కె. ఈశ్వర్. కార్యదర్శి : పి. అర్జునరావు. సంయుక్త కార్యదర్శి : వి. సత్యనారాయణ. కోశాధికారి : టి. కిశోర్. కార్యవర్గ సభ్యులు : గౌతమ్, టి. నరసింహం, వెంకటేశ్వరరావు, కె. ఉమామహేశ్వరరావు, రామచంద్రారెడ్డి, దేవానంద్, బాల్జీ. అడ్వయిజరీ కమిటీ : కె. కె. శర్మ, ఎస్. ఆర్. చందూర్, డాక్టర్ మల్లికార్జునరావు, టి. ఆర్. శ్రీనివాస్, ఎం. జగదీశ్‌బాబు, జి. వి. జి.



లైబ్రరీలో తిప్పలుపడి ఎలాగోలా ఆవేళ్టి దినపత్రికను చదవటం పూర్తిచేసి ఓ మహాయజ్ఞం నిర్వహించినట్లు అనుభూతి చెందుతూ బయటికి వచ్చారు మూర్తిగారు. మరి అక్కడికి వచ్చేవి నాలుగు పేపర్లైతే వాటికోసం ఎగబడేది నలభై మంది!

# కొత్తచెప్పులు

అన్నపూర్ణ



ఉదయం లేచి స్నాన సంధ్యలు కానిచ్చుకొని, కాఫీ త్రాగి ఇంట్లోంచి బయలుదేరతారు మూర్తిగారు అప్పటికి దాదాపు ఎనిమిది గంటలవుతుంది వేరే ఎక్కడా ఏ కార్యక్రమాలూ లేని ఆయన ఏరాసరి లైబ్రరీకి వెళ్ళటం, పది గంటలయ్యేదాకా అక్కడ పేపర్లతో కుస్తీపట్టి వచ్చేసరికి ఇంటి దగ్గిర వంట పూర్తికావటం – భోంచేసి అలా విశ్రాంతిగా పడుకోవటం – ఇది ఆయన నిత్య కార్యక్రమం సాయంత్రం పూట ఏ పార్కుకో వెళ్ళి చల్లగాలికి కూర్చోవటం, వీలుంటే ఆధ్యాత్మిక చింతనలో పడటం -- చేస్తూంటారు

పేపరు చదవటానికి ఆవేళ తను పడిన తిప్పల్ని తలుచుకున్న ఆయనకు విసుగు అనిపించింది పైపెచ్చు పైన కొంచెం ఎండ ఎక్కువని పిస్తోంది త్వరత్వరగా అడుగులు వేయటం మొదలుపెట్టారు మూర్తిగారు అలా కొద్ది దూరం నడిచారో లేదో కుడికాలి చెప్పు పట్టెడ పుటుక్కున తెగింది. అది చూసి ప్రక్కనే డుస్తున్న ఓ కుర్రాడు కిసుక్కున నవ్వాడు

''హారి భడవా!'' అని తమూ నవ్వి, వంగి తెగిన చెప్పువైపు జాలిగా, పరిశీలనగా చూశారు... అది నిన్న కుట్టించిన చెప్పే – రూపాయి తీసుకొని కుట్టాడు దాన్ని! కల్తీ మందులు, కల్తీ వస్తువులు – చెప్పులు కుట్టటంలోనూ మోసమే? అందుకే అన్నారు కలికాలం అని

తెగిన ఆ చెప్పును 'తిరిగి కుట్టిద్దామా' అన్న ఆలోచన వచ్చింది - కానీ, అప్పటికే ఆ జతను ఏ పాతికసార్లో కుట్టించినట్లు జ్ఞాపకం వచ్చి ప్రయత్నం విరమించుకున్నారు ప్రతిసారీ రూపాయలకు రూపాయలు తగలేసి ఈ పాతవాట్ని బాగుచేయించేకంటే కొత్త చెప్పులు కొనటమే మంచిదనిపించింది. అయితే... ఏ వస్తువు ధర చూసినా ఆకాశాన్ని అంటుతున్న ఈ రోజుల్లో, తనవంటి సామాన్యుడికి ఖరీదుపెట్టి ఓ మంచి చెప్పుల జత కొనటం సాధ్యమేనా?... కాదు. అయినా తప్పదు

ఎలాగైనా తిప్పలుపడి తను కొత్త చెప్పుల జత కొనితీరాల్సిందే... ఎలా? ఆలోచిస్తూ తెగిన చెప్పుల్ని చేతపట్టుకొని ఇంటికి చేరాడు

ఆ యిల్లు... అది తన స్వంత యిల్లు. జీవితంలో కష్టపడి తను కట్టించాడు దాన్ని – ఇంట్లో అడుగుపెట్టిన ప్రతిసారీ మూర్తిగారికి కలిగే తృప్తి అది.

''వంట పూర్తయింది వడ్డిస్తాను రండి..'' --లోపలికి వచ్చిన భర్తను చూసి అంది సీతమ్మగారు

''కాదులే. కాసిని మంచి తీర్థమిచ్చి పుచ్చుకుని... ఉంచ్రాయి, అట్లకాడ తీసుకువచ్చివ్వు చెప్పులు మళ్ళీ తెగిపోయాయి.'' అన్నారు మూర్తిగారు చెమట అనిపించి చొక్కా తీసి గోడ కొక్కేనికి తగిలిస్తూ

''వాట్ని బాగుచెయ్యటం మీవల్లేమవుతుంది... షాపులో కుట్టించకపోయారూ?''

''లాభంలేదే నిన్న కుట్టించిన చెప్పు ఈవేళ తెగిపోయింది ఇలా రూపాయలు రూపాయలు దండగపెట్టి లాభంలేదుగాని – వాట్ని బాగుచేసి తాత్కాలికంగా తొడుక్కుంటాను రేపు ఫస్టు తారీఖు ఏవిధంగానైనా కొత్త చెప్పులు కొనెయ్యాల్సిందేనే. జోళ్ళు లేకుండా నేను అసలే నడవలేను నీకు తెల్సుగా...?''

''కొంటారు ఏంపెట్టి..?''

''ఏదో ఒకటి పెట్టి కొంటానుగానీ, ముందు నే చెప్పినవి తీసుకురా పో'' – అసహనం పెరిగి ఆజ్ఞాపించినట్లు అన్నారు మూర్తి

అలాగే వెళ్ళి చెప్పినవి తెచ్చియిచ్చింది సీతమ్మగారు

వరండాలో కూర్చొని ఓ గంట కష్టపడి – మొత్తానికి వాట్ని ఎలాగోలా తొడుక్కోవటానికి వీలుగా చేసి – ఆవేళ తానొక రూపాయి ఆదా చేయగలిగినందుకు తృప్తి ఫీలవుతూ లేచారు మూర్తిగారు.

అదే సమయంలో ''పోస్ట్'' అంటూ సైకిలు మీద వచ్చిన పోస్టుమాన్ ఓ కవరు గిరవాటు వేసి వెళ్ళాడు

ఉత్తరం అందుకున్నప్పుడు ఆయనలో కనిపించిన ఉత్సాహం, దానిలోని విషయం తెలిశాక మటుమాయమైపోయింది. అది మూర్తిగారి కొడుకు శేఖరం రాసింది.

పెద్ద మనవడు ఫల్గుణకు ఈమధ్య జ్వరం వచ్చి తగ్గిపోయిందిట ప్రస్తుతం కోడలు కమలకు ఒంట్లో బావుండలేదుట. పిల్లలతో వేగటం చాలా కష్టంగా ఉంది కాబట్టి తల్లిదండ్రులను వెంటనే బయలుదేరి రావలసిందిగా కోరాడు అతడు.

''ఏవండీ. మీరిక భోజనానికి వచ్చేదిలేదా?'' అంటూ ఇవతలికి వచ్చిన సీతమ్మగారు భర్త చేతిలో రెపరెపలాడుతున్న ఉత్తరాన్ని చూసి, ''శేఖరం దగ్గర్నుంచా, నీరజ దగ్గర్నుంచా?'' అనడిగింది, కొడుకు శేఖరం, లేకపోతే కూతురు నీరజ–వాళ్ళిద్దరి దగ్గర్నుంచీ కాకపోతే ఆత్మీయంగా

# ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

## లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోసం నిజంగా మీరు ఎదురు చూస్తున్నారు. అదే క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమమైన మంచి ఎగుమతి రకం డస్ట్ టీ రకాలను మేళవించి చిక్కటి కమ్మని టీ కోసం చూచే మీలాంటి వారి కోసమే యీ టీ.
నేడే లిప్టన్ టాప్ స్టార్ కావాలని అడగండి.
పూర్తిగా ఫాయిల్‌లోనే ప్యాక్ చేసారు గనుక తాజాగా, చిక్కగా, కమ్మగా మీరు కోరినట్లు వుంటుంది.




LT/CAS-I/77R TEL

## సంతృప్తి నిచ్చే స్ట్రాంగ్ టీ

తమకు ఉత్తరాలు రాసేవాళ్ళు మరెవరున్నారు ? అన్న ధీమాతో

"శేఖరమే వ్రాశాడే" – మూర్తిగారిది హీన స్వరమైంది

భర్త వాలకం చూసిన సీతమ్మగారికి ఆందోళన అనిపించింది

*    *    *

గోదావరి ఎక్స్‌ప్రెస్ జోరుగా పోతోంది హైదరాబాద్ వైపు ... అది రాత్రి పూట ప్రయాణం . అతిప్రయాస మీద ఎక్కిన కంపార్టుమెంట్‌లో కూర్చోవటానికి సీట్లు సంపాదించగలిగారు మూర్తిగారు ఆకలి రుచెరగదు, నిద్ర సుఖమెరగదు అన్నట్లు పై బెర్తుల మీద కొందరు, క్రింద గుడ్డ పరుచుకొని కొందరు – పడుకున్నారు. చీకుచింత ఎరగనట్లు సీతమ్మగారు కూర్చున్నచోటే నిద్రలోకి జారుకుంది ... అయితే మూర్తిగారు . ఆయనకు ప్రయత్నించినా నిద్ర రావటంలేదు.

'మూర్తికేం, అదృష్టజాతకుడు ! కుటుంబ నియంత్రణ పాటించినట్లు, ఒక్క కొడుకు, ఒక్క కూతురు . 'నా' అన్న ఓ కుటీరం ఏర్పాటు చేసుకున్నాడు కూతురికి ఘనంగా పెళ్లిచేసి అత్తారింటికి పంపాడు ఉన్న ఊళ్ళోనే కొడుక్కు ఉద్యోగం వచ్చింది చేసుకున్న కోడలు కూడా యోగ్యురాలు అత్తమామలను పూవుల్లో పెట్టుకు చూసుకుంటుంది నెల తిరిగేసరికి ఠంచనుగా పెన్షన్ వస్తుంది రిటైరయ్యాక ట్యూషన్లు చెప్పటం మొదలుపెట్టాడు కానీ, కొడుకే పట్టుపట్టి వద్దని మాన్పించేశాడు - ఎంత పుణ్యం చేసుకొంటే అటువంటి భాగ్యం కలుగుతుందంటావ్ ?' - తనని గురించి తెలిసినవాళ్ళు ఒకరితో ఒకరు అలా అనుకోవటం చాలాసార్లు విన్నాడు

నిజమే మొదట్లో యెలా బ్రతికినా ఈ చివరిరోజుల్లో తనకు యెంతో ప్రశాంతంగ వుంది అయితే ఆరుమాసాల క్రితం శేఖరాన్ని

# కొత్త చెప్పులు

వున్న ఊళ్ళోంచీ హైదరాబాద్ హెడ్‌ఆఫీసుకు ట్రాన్స్‌ఫర్ చేశారు – అతడు అక్కడికి వెళ్లిపోవటంతో తనలో ఓ విధమైన దిగులు, ఆలోచనా మొదలయ్యాయి ... హైదరాబాద్ వంటి మహానగరంలో కాపురం పెట్టిన కొడుకుపైన ఆధారపడి బ్రతకటంలో ఔచిత్యం లేదనిపించింది... లోగడ తను ట్యూషన్లు చెప్పాడు మధ్యలో గుండెపోటు వచ్చి అనారోగ్యం చేసింది. తను ఎక్కువగా మాట్లాడటం తగ్గించుకోమని సలహా యిచ్చాడు డాక్టరు ... పిల్లలకు ట్యూషన్ చెప్పాలంటే గొంతు చించుకోవాలి ... దీనిమీద శేఖరం పట్టుబట్టి చెప్పే ట్యూషన్స్ మాన్పించేశాడు. తన మాటకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే 'ఒట్టే'నంటూ తన దగ్గర మాట తీసుకున్నాడు నిజంగా శేఖరానికి తామంటే యెంత గౌరవము, విలువో ! . చివరికి వాడి మాటకు కట్టుబడక తప్పలేదు . ఇప్పటికీ ప్రతి ఉత్తరంలోనూ 'మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి నా 'ఒట్టు' సంగతి మరిచిపోవద్ద'ని రాస్తూనే వుంటాడు

నెల నెల పెన్షన్ రూపంలో ఎచ్చే కొద్ది మొత్తం, కొడుకు పంపేదీ – తమ భార్యాభర్తల తిండికి బొటాబొటీగా సరిపోతోంది . కట్టుగుడ్డలుగాని, మరే అవసరంగాని – ఆ తినే వాటిల్లో మిగిల్చి అమర్చుకోవలసిందే

మధ్యలో 'లావెటరీ'కి వెళ్ళాలనిపించి లేచారు మూర్తిగారు క్రింద పడుకున్న తళ్లులు, పిల్లలను తప్పించుకొంటూ ఓ రెండడుగులు వేశారోలేదో ఎడమకాలి చెప్పు ఉంగటం తెగింది దాంతో ఆయన మనసు గట్టిగా మూల్గింది

అవసరం తీర్చుకు వచ్చి సీటులో కూర్చొని 'ఈ వెధవ చెప్పుల పని పూర్తిగా అయిపోయింది వీట్ని అవతల పారేస్తేనేగాని పట్టుకున్న దరిద్రం వదిలేట్టులేదు ... అసలు ఈవేళ ప్రయాణం తగిలకపోతే రేపు ఏవో తిప్పలుపడి కొత్త చెప్పులు కొనేసేవాడే ... తనంటే మంచి గురి కుదిరిన వ్యక్తి పక్కింట్లోకి ఈమధ్యనే అద్దెకు వచ్చిన శేషయ్య అతణ్ణి ఎప్పుడూ అప్పు అడగలేదు.. చెప్పులను గురించి రేపు మాత్రం అడుగుదామను కున్నాడు ... అలాంటిది ఈ ప్రయాణం గురించి ఈవేళే అడగవలసివచ్చింది . అడిగీ అడగటంతోనే 'అవసరపడతయ్. ఉంచండి' అంటూ తను అడిగినదానికన్నా ఓ పది ఎక్కువే యిచ్చాడు అతడు ... శేషయ్యకు తిరిగి ఆ అప్పు తీర్చగలిగేది ఎప్పుడో ? ... అసలే ఇబ్బందుల్లోవున్న శేఖరం మాత్రం తనకేం సర్దగలడు ? ' అలా ఆలోచిస్తుండగానే నిద్రపట్టేసింది మూర్తిగారికి

*    *    *

సికింద్రాబాద్ స్టేషన్లో రైలు దిగగానే కనిపించాడు శేఖరం

"ఏరా నాయనా, ఏమిటి అలా చిక్కిపోయావ్ ?" – కొడుకు కనిపించగానే తల్లి ప్రేమతో అడిగింది సీతమ్మగారు శేఖరం సన్నగా నవ్వి వూరుకున్నాడు

"ఈ హైదరాబాద్ నీళ్ళు పడలేదేమోలేవే" అంటూ కొడుకు తరఫున అందుకున్నారు మూర్తిగారు 'అంతేగామాల్సు' అని సరిపెట్టుకొంది సీతమ్మగారు

"రండి నాన్నగారూ" అంటూ తండ్రి చేతిలోని సూట్‌కేసు అందుకున్నాడు శేఖరం

మూర్తిగారూ వాళ్ళు ఎక్కిన ఆటో చిక్కడపల్లి వైపు పోతోంది అప్పటికి పూర్తిగా తెల్లవారింది

"మన నీరజవాళ్ళు వుండేది – మీ ఇంటికి దగ్గరేనా ?" అడిగారు మూర్తిగారు

"లేదు కొంచెం దూరమే నాన్నగారూ .. చెల్లాయి వాళ్ళుండేది ఇసామియా బజారు ." అని చెప్పాడు శేఖరం

"అమ్మాయిని చూడక ఆర్నెల్లయింది .. నాకు కళ్లలో మెసులుతోందండీ మన నీరజ ' అంది సీతమ్మగారు

"రేపు వెళ్దాంలే అమ్మా, చెల్లాయివాళ్ల యింటికి" అంటూ తల్లికి సర్దిచెప్పాడు శేఖరం

ఆటో చిక్కడపల్లి మెయిన్‌రోడ్డు నుంచీ, ఓ సందులోకి చీలి కొంతదూరం పోయాక ఓ బెంగుళూరు పెంకు ఇంటి ముందు ఆగింది చుట్టూ ప్రహరీగోడ, కొద్దిపాటి ఆవరణ – దానిలో వెనకవైపు పోర్షనులో అద్దెకుంటున్నాడు శేఖరం

ఆటో వెళ్లిపోయాక లోపలికి వెళ్లి తలుపు తాళం తీస్తున్న కొడుకును చూసి "కోడలు ఎక్కడికి వెళ్ళిందిరా అబ్బాయ్ ?" అని అడిగారు మూర్తి దంపతులు ఏకకంఠంతో

"కమల హాస్పిటల్లో వుంది నాన్నగారూ ... పిల్లలు .. ఇక్కడే మనకు తెలిసినవాళ్ళ ఇంట్లో వున్నారు ... మీరు లోపలికి పదండి. నేను వెళ్లి వాళ్ళను తీసుకొని వస్తాను" అంటూ వెళ్లాడు శేఖరం.

రెండు గదుల పోర్షన్ అది ఓ గదిలో



# కొత్త చెప్పులు

రెండు మంచాలు పడతయ్ మరో గది కనీసం ఓ మంచం కూడా పట్టేట్టులేదు వంట చేసుకోవటానికి మాత్రమే ఉపయోగపడుతుంది. ఈ ఒక్క పెద్దగదిలోనే కొడుకు, కోడలు - ఇద్దరు పిల్లలు పడుకోవాలన్నమాట! అద్దె ఎంతో? - మూర్తిగారు ఆలోచిస్తున్నారు

"కోడలు హాస్పిటల్లో వుందంటున్నావు అబ్బాయ్, అంత జబ్బు చేసిందేమిటండీ?" - తన ఆలోచనను బయటకు అనేసింది సీతమ్మగారు

వెళ్ళిన పీపుమీద చరిచినట్లైంది మూర్తిగారికి అప్పుడే పిల్లల్ని తీసుకొని లోపలికి వచ్చిన శేఖరం,

"లేదమ్మా కమల ఆపరేషన్ చేయించుకొంది అంతే" అని చెప్పాడు తల్లికి

"అంటే? ఫ్యామిలీ ప్లానింగా?" అన్నారు మూర్తిగారు



'అందాల రాశి' లో రతి

"అవును నాన్నగారూ."

"అదేవిట్రా! ... కోడలికి ఆడపిల్లంటే 'పగని ఇది' కద? . ఆ ముచ్చట తీరకుండానే ఆపరేషన్ చేయించావేమిటి?" అంది సీతమ్మగారు

సమాధానం చెప్పలేకపోయాడు శేఖరం దానిపై తర్కించలేకపోయారు మూర్తిగారు

పదేళ్ళ ఫల్గుణ్, ఐదేళ్ళ కిరణ్ "తాతయ్యా, బామ్మా" అంటూ అలవాటుకొద్దీ చొరవగా దగ్గరికి వచ్చారు "మా నాయనే మా బాబే" అంటూ ఇద్దరు మనవళ్ళి దగ్గరకు తీసుకొని మురిసిపోయారు ఆ వృద్ధదంపతులు

"నాన్నగారూ, కాలకృత్యాలు తీర్చుకోండి హాస్పిటల్‌కు వెళ్ళి కమలను చూసివద్దాం రేపు ఇల్లు తీసేస్తారుటలెండి... అమ్మా, చిన్న గది బీరువాలో పాలగిన్నె ఉంది...కాఫీ తయారుచెయ్యి... నేనిప్పుడే వస్తాను" అని బయటికి వెళ్ళాడు శేఖరం

మూర్తిగారు బాత్‌రూమ్‌లోకి వెళ్ళారు సీతమ్మగారు దంతధావనం చేసివచ్చి స్టౌ ముందు కూర్చొని కాఫీ డికాషన్ పెట్టింది మనవలిద్దరూ ఆవిడదగ్గరే కూర్చొని కబుర్లు కొట్టేస్తున్నారు

"అసలు ఏం జరిగిందంటే బామ్మా, అమ్మ నాకిప్పుడు ఆపరేషన్ వద్దని పోట్లాడింది నాన్నగారేమో వీల్లేదు నువ్వు చేయించుకు తీరాల్సిందే అని పట్టుబట్టారు చివరికి అప్పుడన్నట్లే ఒప్పుకుంది అమ్మ ఉద్యోగస్థులు ఫ్యామిలీ ప్లానింగు పాటిస్తే రెండు ఇంక్రిమెంట్స్ ఇస్తారట గవర్నమెంటువాళ్ళు!" — మాటల సందర్భంలో గ్రామ్యకం తెలిసిన ఫల్గుణ అసలు రహస్యం బయటపెట్టేశాడు.

"అదన్నమాట కిటుకు!... చివరికి మీ నాన్న ఇలా తయారయ్యాడా?" అంది సీతమ్మగారు

మనవడి ఆ మాటలు బాత్‌రూమ్‌లోంచి బయటికివచ్చిన మూర్తిగారికీ వినిపించి ఖిన్నులైపోయారు

బర్త్‌కంట్రోలు పాటిస్తే రెండు ఇంక్రిమెంట్లు వస్తయ్యా? జీతం పెరగటం కోసం భార్య అభిమతానికి విరుద్ధంగా ఆపరేషన్ చేయించటానికి సిద్ధపడ్డాడా శేఖరం? మొదట్నుంచీ ఎవరి మనస్సూ నొప్పించటం చేతకాని తన కొడుకు కోడలి విషయంలో ఏమాత్రం కనికరం లేకుండా ప్రవర్తించాడంటే - ఆయన కింకా నమ్మకం చిక్కటంలేదు.

జరుగుతున్న దాన్నిబట్టి చూస్తే ఇక్కడ శేఖరం పరిస్థితి ఏమీ బావుండలేదన్నమాట.

కొద్దిసేపట్లోనే ఏవో పొట్లాలతో తిరిగి వచ్చాడు శేఖరం "టిఫిన్ తెచ్చాను అందరికీ వడ్డించమ్మా" అంటూ తల్లిముందు పెట్టాడు వాట్ని

"ఏరా నాయనా కోడలి విషయంలో ఎందుకంత తొందరపడ్డావ్?" — టిఫిన్ తింటున్న శేఖరాన్ని అడిగింది సీతమ్మగారు పట్టలేక

"ఇద్దరు పిల్లలు ఉన్నారుకదమ్మా వీళ్ళను జాగ్రత్తగా చూసుకుంటూ, ఆరోగ్యంగా పెంచుకొంటే సరిపోతుందనిపించింది" అంటూ తల్లికి నచ్చచెప్పాలని చూశాడు శేఖరం

సీతమ్మగారు మరేం మాట్లాడలేకపోయింది

మూర్తిగారు టిఫిన్ చేస్తూ మధ్య మధ్య దిగజారిపోయిన కొడుకును మార్చి మార్చి చూస్తున్నారు

"ఇంటి అద్దె ఎంతరా అబ్బాయ్?"

"మూటయాభై నాన్నగారూ."

"అబ్బో! ఈ రెండు చిన్నగదులూ మూటయాభై రూపాయలే!" — ముక్కున వేలేసుకొంది సీతమ్మగారు

"ఇలాంటి సిటీల్లో అంతే వుంటయ్‌లేవే అద్దెలు" అని భార్యకు చెప్పి, "అన్నట్లు శేఖరం, నీ చేతికి ఉంగరం వుండాలికద? కనిపించదేం?" అడిగారు మూర్తిగారు గుర్తువచ్చి

గతుక్కుమన్నాడు శేఖరం వెంటనే సమాధానం చెప్పటం చేతకాలేదు అతడికి

విషయం గ్రహించిన మూర్తి దంపతులు మరి రెట్టించలేదు దాన్ని గురించి

అందరితో కలిసి హాస్పిటల్‌కని బయలుదేరిన మూర్తిగారు ఇంటి ఆవరణ గేటు దాటారోలేదో— కుడికాలి చెప్పు మళ్ళీ తెగింది "అరే చెప్పు తెగిపోయినట్లుంది నాన్నగారూ దారిలో కుట్టిద్దాం పదండి" అన్నాడు శేఖరం వాట్ని చూసి

ఆ చెప్పుల్ని వాటికి వున్న అన్ని అతుకుల్నీ చూశాకకూడా కొడుకు అలా అనేసరికి మూర్తిగారి మనస్సు కలుక్కుమంది శేఖరంలో వచ్చిన — పరిస్థితులు తెచ్చిన మార్పు అప్పుడు సుస్పష్టమైంది ఆయనకు లోగడే కనుక ఇలా జరిగివుంటే "ఆ చెప్పులిక పనికిరావు వాట్ని అవతల పారేసి కొత్తవి కొనుక్కోండి నాన్నగారూ" అని టక్కున అనేసేవాడు

కొడుకువైపు జాలిగా చూసి, "ఇవి కాళ్ళకు వచ్చేట్లులేవు లోపల పడేసి వస్తా శేఖరం" అని వెనక్కుతిరిగి వెళ్ళారు మూర్తిగారు

* * *

మూర్తిగారు హైదరాబాద్ వచ్చి దాదాపు పదిరోజులైంది కోడలు ఇంటికి వచ్చింది కులాసాగాకూడా తిరుగుతోంది ఇక తాము స్వగ్రామం వెళ్ళటం మంచిదేమో అనిపించింది ఆయనకు

ఎందుకంటే కూర్చోవటానికీ, తిరగటానికీ కూడా అసౌకర్యంగా వుంది ఆ యిల్లు అదీగాక కొడుక్కు భారమవుతుంది తామిక్కడవుంటే. ఆమాట శేఖరానికి చెబితే "మీ ఇష్టం

నాన్నగారూ ... ఈ నెలలో మీకేమీ సర్దలేక పోయాను. అనవసరంగా ప్రయాణం పెట్టాను... వచ్చే నెల కొంచెం ఎక్కువ పంపటానికి ప్రయత్నిస్తాను.'' అన్నాడు అతడు

కొడుకు దైన్యస్థితిని, ఆ మాటల ధోరణిని చూసిన మూర్తిగారికి దుఃఖం పొంగుకు వచ్చింది. కానీ, తమాయించుకున్నారు

''ఈవేళైనా నీరజ వాళ్ల ఇంటికి వెళ్దాంరా అబ్బాయ్ .. అమ్మాయినీ, అల్లుణ్ణీ చూశామే అనుకో .. అయినా వాళ్ళ ఇల్లు అదీ కూడా చూద్దామని..'' అన్న సీతమ్మగారికి ''సరే, అమ్మా'' అన్న శేఖరం సమాధానం వెంటనే వచ్చింది

* * *

''రేపు ఉదయమేనా తాతయ్యా మీరు వెళ్ళిపోయేది ?'' – మూర్తిగారి చెయ్యి పట్టుకొని నడుస్తున్న ఫల్గుణ అడిగాడు

''అవునురా ప్రొద్దున్నే కృష్ణా ఎక్స్‌ప్రెస్‌కు వెళ్ళిపోతాం'' అని చెప్పారు.. ఉదయం కూతురు నీరజవాళ్ళ యింటికి వెళ్ళి భోంచేసి వచ్చేశారు మధ్యాహ్నం సాయంత్రం మనవడితో అలా ఎక్కడపల్లి మెయిన్‌రోడ్డు దాకా వెళ్దామని బయలుదేరారు

మొత్తానికి మూర్తిగారికి అప్పుడు చాలా ఉత్సాహంగా ఉంది కొన్ని రోజులుగా ఎదురు చూస్తున్న తన కోరిక కొద్ది క్షణాలలో నెరవేర బోతోంది తను చెప్పుల జత కొంటున్నాడు కొనగలిగేవి మంచివే కొనాలి.

ఉదయం నీరజవాళ్ళ యింటికి వెళ్ళినప్పుడు పెద్దని మొత్తుకుంటున్నా వినకుండా ఓ వంద రూపాయల నోటు చేతిలో పెట్టింది చాటుగా, ''అసలే అన్నయ్య ఇబ్బందులో ఉన్నాడు. కనీసం చార్జీలైనా ఇచ్చి పంపగలుగుతాడో లేదో... ఇవి దగ్గర ఉంచండి నాన్నగారూ'' అంటూ. ఓ యాభై చార్జీలకు పోయినా యాభై మిగులుతయ్.. ఇప్పుడైనా చెప్పుల దరిద్రం వదుల్చుకోవాలి...

ఓ ఫుట్‌వేర్ షాపులోకి వెళ్ళి – కొన్ని జోళ్ళు చూపించమని చూస్తున్నారు మూర్తిగారు

ఈలోగా, ''తాతయ్యా ఆ బూట్లు చాలా బాగున్నయ్ కదూ ? . మంచివి కొనండి నాన్నగారూ అంటే ఈ హవాయి చెప్పులు కొనిపెట్టాడు .. చూడు ఇవి వట్టిగానే అరిగి పోయినయ్. నాకు అవి కొనిపెడతావా తాతయ్యా?'' అని అడిగాడు ఫల్గుణ గోముగా.

మనవడు అలా అడిగేసరికి చెంపవ ఎవరో చెళ్ళున చరిచినట్లు అనిపించింది మూర్తిగారికి... ప్రస్తుతం కొడుకు, అతడున్న పరిస్థితీ ఒక్కసారిగా ఆయన కళ్ళముందు గిర్రున తిరిగింది... శేఖరం చేతికున్న ఉంగరం అమ్మేసుకున్నాడు. జీతం పెరుగుతుందన్న ఆశతో బలవంతాన కోడలికి కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించాడు ... ఇంతా ఎందుకు జరిగింది ? ఎవరికోసం అతడు తిప్పలు పడుతున్నాడు ?... తామందరికోసం !.. మరి తను ?... తన స్వార్థమే చూసుకుంటు న్నాడు... కాటికి కాళ్ళు చాచిన తనకే కోర్కెలు



చావలేదు... ? తనకంటే శేఖరమే గొప్పవాడు. . వాడికి ఏ కోరికా లేదు... స్వార్థం చూసుకోకుండా భార్యాబిడ్డలకోసం, తల్లిదండ్రులకోసం వాడు పాటుపడుతున్నాడు

మనసును న్యూనతాభావం ఆదరించగా ఏళ్ళు పైబడ్డ తను వేటిని గురించైనా మోజుపడటంలో అర్థంలేదనిపించి, ఇపుడిపుడే ప్రపంచాన్ని తెలుసు కుంటున్న పసివాడు, చదువుకొని అభివృద్ధిలోకి రావలసినవాడు అయిన మనవడు అలా ఆశ పడటంలో తప్పు లేదనుకొని వెంటనే తన చెప్పుల మాట వదిలేసి ఫల్గుణకు కోరిన బూట్లు కొనిపెట్టేశారు మూర్తిగారు.

''మరి నీకు అసలే చెప్పులు లేవుగ . నువ్వు కొనుక్కోవేం తాతయ్యా?'' అన్న మనవడి ప్రశ్నకు, ''మా వూరు వెళ్లాక కొనుక్కుంటా లేరా'' అని సమాధానం చెప్పారు

''అదేమిటి నాన్నగారూ, మీ చెప్పులు పూర్తిగా పోయాయికద ఏవో వున్నయ్ – వాడికి కొనిపెట్టారేమిటి ?'' అనడిగాడు శేఖరం ఇంటికి వచ్చాక.

''నాకు చెప్పులు పడటంలేదురా .. కొత్త చెప్పులు తొడిగితే పుళ్ళు పడతయ్ ఓపట్టాన అవి మానవు .. ఏవో వున్నయ్‌కద ... వాట్నే తొడుగుతాను .. అయినా నేను ఎక్కడికి తిరగాలి ? ... ఇంట్లో కూర్చోవటమేగా మన వూళ్ళో '' – చిన్నతనంనుంచీ నిజాయితీ, నిస్వార్థం, సత్యం – వీట్నే గురించి బోధించిన మూర్తిగారే చివరికి కొడుకు ముందు అబద్ధా లాడటం మొదలుపెట్టారు

తమ వూరు వచ్చాక ఆయన మొట్టమొదట చేసింది ట్యూషన్లు కుదుర్చుకోవటం నాలుగు మంచి ట్యూషన్లు కుదిరాక తీర్చగలమన్న ధైర్యం వచ్చి అప్పుచేసి ఓ కొత్త చెప్పులజత కొన్నారు మూర్తిగారు అదేమిటో కాళ్ళకు చెప్పులులేందే ఆయన నడవలేరు అది తన బలహీనతగా భావించుకుంటారు మూర్తిగారు

కన్న తల్లిదండ్రుల మనసు నొవ్వకూడదని తను ఎన్ని ఇబ్బందులు పడుతున్నా తమకు తెలియనీయకుండా గడుపుకొంటూ వచ్చాడు శేఖరం ఒకవిధంగా వాడిది త్యాగబుద్ధే అలాగే బిడ్డలు తమవల్ల ఎలాంటి కష్టనష్టాలకూ గురికాకూడదని కోరుకుంటారు ప్రతి తల్లిదండ్రులు అది త్యాగం కాదు. కనీస కర్తవ్యం దాన్ని నెరవేర్చటానికి పూనుకుంటున్నా డతను. అంతే

''నాలో ఇంకా జవసత్వాలున్నయ్ అయినా ఒక్కడు సంపాదిస్తుంటే వాణ్ణి ఆశ్రయించుకొని ఇంటిల్లిపాదీ బ్రతకాలనుకోవటంలో నాకు న్యాయం కనిపించటంలేదు. అందుకే నేను తిరిగి ట్యూషన్లు చెప్పటం మొదలుపెట్టాను నా శక్తిని సద్వినియోగపరుచుకోవాలనేగాని, నీ అసమర్థతను వేలెత్తి చూపటం నా అభిమతంకాదు శేఖరం . కాబట్టి నీవిక నాకు డబ్బు పంపనక్కరలేదు'' అంటూ ఉత్తరం రాసి, కొత్త చెప్పులు తొడుక్కొని దాన్ని పోస్టుచేయటానికి వెళ్లారు మూర్తిగారు, ఆ ఉదయం ●

పొదుపు ఉద్యమ సంస్థ భవన నిర్మాణం

ఈ శంకుస్థాపన కార్యక్రమం చాలా బాగా జరిగింది, సంతోషం. కాని దేశ ఆర్థికపరిస్థితులదృష్ట్యా ఈభవన నిర్మాణాన్ని ఇంతటితో నిలిపివేస్తున్నామని తెల్పుటానికి చింతిస్తున్నాను!







ఔత్సాహిక పాదాలకు
సర్వకాలరక్ష
TROT®
కుషన్
కలకాలమూఉండే పాదసౌకర్యము
జయింట్స్ 11&12 రూ. 11.95
మగవారివి 7 – 10 రూ. 11.50
ఆడవారివి 2 – 6 రూ. 10.50
పిల్లలవి 9 – 1 రూ. 7.50
శిశువులవి 6 – 8 రూ. 6.50
స్థానిక పన్నులు అదనము
ట్రాట్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు స్వంతదారులు:
ట్రాట్ షూ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
19/4A మున్షీగంజ్ రోడ్
కిద్దర్‌పూర్, కలకత్తా 700 023
సుప్రసిద్ధ "హవాయి" స్లిప్పర్స్
తయారీలో ఇండియా నిపుణులు




డైనమిక్ రబ్బర్ & ప్లాస్టిక్ ప్రైవేట్ లిమిటెడ్
వైట్‌ఫీల్డ్ రోడ్, మహాదేవపుర పోస్ట్
బెంగళూరు 560 048
Grant. DRP. 8 Tel

# బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్

## మంచి కాఫీకి సారవంతమైన రుచికి ఎల్లప్పుడూ నమ్మవచ్చును




గ్రీన్ లేబిల్ యొక్క రుచి మీరు దీనిని కొన్ని సంవత్సరంలుగా ఇష్టపడేలా చేసింది. సువాసన మరియు సంతృప్తి నిస్తుంది.

**మీ కుటుంబ సాంప్రదాయకంగా వచ్చిన రుచి**

OBM-6306A1TF

జె. ఆర్. డి; కె. వి. బి.ఎస్. కొత్తపల్లి

మీరెలా ఉంటారు? నవర్సులో హీరోయిన్‌లా ఉంటారా.

నేనా! హ! అలా ఉంటే ఇక్కడెందుకుంటాను. ఏ విజయనిర్మల దర్శకత్వం కిందో ఏ ఏ.ఎన్.ఆర్. పక్కనో, నోనో— (వారు మనవరాలి వయసు వాళ్ళలో నటిస్తుంటే నేనెందుకు అంత పయిసాయసలో నటిస్తాను?) ఏ రజనీకాంత్ పక్కనో వేషం కట్టి మీ ప్రాణాలు తోడుతూ ఉందును! అప్పుడు మీరెలా ఉంటారనియిలా అడిగేవారా? నో— అబ్బ! మీరెం సొప్పు వాడుతారండీ? మీరా సినిమాలో పాత్రకి జీవం పోశారు?! ప్రాణం తీశారు! అంటూ ఆడిపోసుకొందురు!

జి. ఎమ్. బి.ఎస్. పెనుమంట్ర

కొందరు సంసారాలు పచ్చగా ఉంటే చూడలేరు. వాళ్ళు చెడిపోతే సంబరపడతారు....

సహజమే కదా యీ అసూయ!! ముఖ్యంగా ఆడవారికి!

పి. ఎమ్. బి.ఎస్. ఏటికొప్పాక

ఆడది మగవాడికి జీతం లేని మనిషి అయితే మగవాడు ఆడదానికి డబ్బు తయారు చేసే కర్మాగారం అంటాను.

అనండి—అనండి మీరేమన్నా చెల్లుతుంది! జీతం బత్తెం లేని పని మనిషి అన్న మాట నిజమే. కాని డబ్బు సంపాదించే కర్మాగారం మగవాడు అవక తప్పదు, ఆడది సంతానం కనే యంత్రం అనుకుంటే!

మగవాడి భవిష్యత్తును పాడు చేసినది ఆడదే అంటాను.

తిరి కూర్చుని తోడు కావాలని ఆడమ్— ఎందుకండీ పక్కనుక తీసి యీవ్‌ని చేయమని కోరాట్ట!!.... ఎడారిలాంటి జీవితమే— భవిష్యత్తు అనుకుంటే మీజీవితంలోకి ఆడదాన్ని రానివ్వకండి!

జె. బి. ఆర్. మొలగవల్లి

సృష్టిలో భగవంతుడు ప్రతివ్యక్తికీ గర్వించ కలిగే అదృష్టాన్ని, కృంగిపోగల ఒకబాధని యిస్తాడు ఎందుకు అక్కయ్యా?

ఒళ్ళు దగ్గిరెట్టుకుని మసలమని— చెప్పక చెప్తున్నాడన్నమాట—ఆ భగవంతుడు.




పి. ఆర్. ఏ. బొంబాయి

పద్మశ్రీ బిరుదు అంటే అర్థం ఏమిటి? డక్టరేట్?

అది సర్, రావు బహద్దర్ వగైరాలు బ్రిటిష్ ప్రభుత్వం యిచ్చినట్లు మన పూర్వపు కాంగ్రెసు ప్రభుత్వం ప్రత్యేక ఘనతలు కల వ్యక్తులకు ప్రదానం చేసేది. జనతా వారు దాన్ని తీసి రాజ్యాంగ - మరీ వ్యూడల్‌గావున్నాయని. మళ్ళీ ప్రాదు 'జనతా కాంగ్రెస్' కాంగ్రెస్ జనరా సంకర సమరం జరుగుతోంది. కనుక ఎప్పుడు కొత్త బిరుదులు యిస్తారేమో చూడాలి. ఏ కాలంలోనైనా ఏ అధికారవర్గానికైనా ఆశ్రితపక్షపాతం చూపెట్టడానికి కొన్ని మార్గం వుండాలికదా—వాటిలో ఈ బిరుద ప్రదానం ఒకటి. పద్మశ్రీ ప్రభుత్వం యిచ్చేది. డాక్టరేట్ కూడా అలాంటిదే - వాసిలో ఏదైనా విశ్వవిద్యాలయం యిస్తే అదే కష్టపడి పరిశోధన తరువాత థీసిస్ మీద యిచ్చేది డాక్టరేట్. పాపం అందుకే వాళ్ళు మరిచిపోకుండా చివర పి. హెచ్. డి. అని వేసుకోవాలి. లేకపోతే వాళ్ళ పట్టా కూడా వాసి అనుకునే ప్రమాదం వుంది. [తమిళనాడులో స్వీట్ యిస్తే పక్కనే చిన్న ప్లేటులో వా పెంచాడు కారంబూంది ఇస్తారు. దానికి వాసి అని అనడం రివాజు. దీనికి బిల్లు వెధ్యుడు— అంచేత వాసి అంటే ఫ్రీ అనే అర్థం.

పి. బి. ఆర్ పాలకుర్తి

ప్రేమకు పెళ్ళికి మధ్యగల సంబంధం ఏమిటి?

పెళ్ళికి దారితీస్తే — ప్రేమ స్త్రీ లది. పెళ్ళి తప్పించుకో గల్గితే— ప్రేమ పురుష లది. కాని ఏం లాభం? పెళ్ళి ప్రేమా ఇష్టం వున్నా లేకున్నా నాణేనికి రెండు వైపులై కూర్చుంటాయి ఎవరికైనా.

యు. యు. వి. ఎమ్మిగనూరు

ప్రేమలాంటి పవిత్రమైన వస్తువు యీ లోకంలో మరొకటి లేదా?

లేకేం? వుంది డబ్బు. అది ఎలా సంపాదించినా దానిపై ఎలా సంపాదించినదీ రాసి వుండదు కనుక పవిత్రమైనదిగానే భావించబడుతుంది.

నీవును జయించినవాడు వీరుడు. మరి నేనును జయించినవాడు?

పరమ వీరుడ అందాం. ఐ, మి, మైసెల్ఫ్ అన్న మాటలు విన్నప్పుడల్లా నాకు మదర్ విలియమ్ జ్ఞాపకం వస్తుంది. పుట్ ఐ ది డాంకీ రేటర్ అనేవారు ఐ అనో మైసెల్ఫ్ అనో ఏదైనా చెప్పడం ప్రారంభిస్తే ఫలానావారమా. నేనా సరైనదిగాని నేనూ సో అండ్ వి అనడం, మంచి ఇంగ్లీషు కాదనేవారు. అందు బ్రిటిష్ రాణి 'వాడా నా భర్త, నేనూ అంటుందేగాని, రాణి అయినా నేనూ నా భర్త! అనదట!

డి. వి. ఎస్. కె ఎల్ గుంటూరు

రామాయణం విషవృక్షమా? కల్పవృక్షమా?

చూసే దృష్టిమీద ఆధారపడి ఉంటుంది— విషమో అమృతమయమో.

ప్రయిలాబ్‌లో వంటగది పడకగది ఎందుకున్నట్లు?

వెళ్ళినవాళ్ళు— వండుకొందుకు. ఏడుకొందుకు. [మనలో మనమాట— ఎందుకున్నాయనుకున్నారేమిటి? జయమాలిని వేటూరి పాటకి ఆడుతూంటే విలను చూసి ఆనందిస్తూంటే— ఎత్తుక పోబడిన నాయిక ఏడుస్తూ వంట చేస్తూ ఉంటుందనుకోలేదు కద! హీరో కూడా విలనుతో కనిపిస్తుంటే—మరీ బాగుంటుందని పిస్తూంది నాకు!]

వెంకట్ — ఉరవకొండ

ఈనాడు డబ్బు ఒక భీషణరూపందాల్చి సమాజాన్ని గ్రసించి వేస్తూంది. ఈ రోగానికి చికిత్స జరగనంతకాలం పాపం స్త్రీ ఎలా తప్పించుకొని బయటపడకలదు?

ఏమిటో గోల? అర్థం అయి చావడంలేదు స్వామీ. డబ్బు భీషణరూపం దాల్చడం, గ్రసించి వేయడం సరే—స్త్రీ తప్పించుకోడం ఎక్కడికి? కొంపతీసి స్త్రీ సమాజంలో ఒక భాగం కాదనుకోడం లేదు కద!

"ఛ... ఛ... అందుకొక్కాదమ్మా ..." కంగారు పడింది వనజ, తల్లి నొచ్చుకొందని.

"ఉండమ్మా నన్ను మాట్లాడనీ. నాకు తెలుసే తల్లీ! నీ వయసులో నా లాంటి ముసలి వాళ్ళను చూస్తే జుగుప్స, అసహ్యం. వాళ్ళేం మాట్లాడినా విసుగు, వాళ్ళతో మాట్లాడాలంటే చీదర. అగు... నన్ను చెప్పనీ- ఇది మీ తప్పు కాదే అమ్మా! ఆ

## అది గౌరవించే వయసా?

(7వ పేజీ తరువాయి)

వయసుది. కానీ ఈ ముసలితన మన్నది అందరికీ తప్పనిసరి అని- ఈ వయసులో బాధ అందరికీ ఇంతేనని వీరు ఆలోచించరే. ఇన్నాళ్ళూ మీ అందరికోసం నేను చేసిన చాకిరీ అంతా మర్చిపోయారు. లేచి ఒకళ్ళకు చేయలేని ఇప్పటిస్థితిలో అందరికీ చులకనేనే అమ్మా! మొన్నటి వరకూ వంట కూడా చేసేవదాన్ని కానూ! నా వంట తగలేసినట్లుందని పిల్లలు కూడా విసుక్కోవడంతో మీ వదినకు తప్పింది కాదు. అమ్మాయ్యా, పెద్దతనం; త్వరత్వరగా ఎలా చేయగలను చెప్పు కళ్ళు సరిగ్గా ఆనవు. పోపు వేగిందో, లేదో తెలియదు- పైగా మతి మరుపు. ఉప్పు, చింతపండు వేశానో లేదో మరచిపోవడం. మరేం చెయ్యనమ్మా, వంట తగలేసినట్లే ఉంటుంది. పోనీ చేతనైనసాయం

చద్దామంటే 'నా పని నేను చేసుకుంటాను; మీరు అడ్డం రాకపోతే అంతే చాలు' అని విదిలిస్తుంది మీ వదిన. నాకు మాత్రం పిచ్చిగా లేదా అమ్మా, తిని కూచోడం. చేసిన చేతికి పని లేకపోతే ఏం తోస్తుంది చెప్పు. ఇదంతా నా ఖర్మలే తల్లీ. ఇంత కాలం బతికుండడమే మహా పాపం అనుకో'' ఇంక ముసలావిడకి గొంతు పూడిపోయి మాట రాలేదు. కొంగుతో కళ్ళొత్తుకుంటూ కూర్చుంది.

తల్లి మాటలు విని వనజ తెల్లబోయింది. రెండు సంవత్సరాల్లో ఎంత మార్పు వచ్చింది ఇంట్లో. అప్పుడు ఆయన, తనూ వచ్చినప్పుడు— అమ్మే అల్లుడికిష్టమైనవి వండి పెడుతుంటే- అమ్మ ప్రేమతో, వదిన హాస్యంతో, అన్నయ్య అభిమానంతో, పిల్లల అల్లరితో ఎంత సందడిగా సరదాగా గడిచిపోయింది. ఏదో ఆఫీసులో ఇన్‌స్పెక్షన్ ఉండి ఆయన రాకపోవడం మంచిదే అయింది ఈ పరిస్థితుల్లో. అమ్మకి ఓపిక తగ్గేటప్పటికి అందరి అసహనం బయట పడింది. తనే చేయవలసి వచ్చేటప్పటికి వదినకు చిరాకులు పరాకులు ఎక్కువయ్యాయి... వనజ ఆలోచనల్ని తెంపుతూ ముసలావిడ అందుకుంది. "ఏమిటో నే అమ్మా, ఇన్నాళ్ళకి నా మనసు విప్పి చెప్పుకునేందుకు నువ్వు దొరికావు. లేకపోతే నా నోటికి తాళమే అనుకో. మొన్న చూశావుగా హరి, ఏ విషయం మాట్లాడబోయినా అలా విసిరికొట్టడమే. ఆ సుశీలకి- అప్పట్టి పేరు మార్చుకుందేవ్ షీలట, దానిముఖం కాదూ— వితంతు పెన్షన్ నీకూ- దానికి, ఆ హరిగాడికి నా పొడే గిట్టదు. చిన్నవాళ్ళిద్దరూ దాసేపు నా దగ్గరున్నా ఓర్వలేరు. అయినా వాళ్ళూ చదువుల్లో పడ్డారుగా, వాళ్ళ చదువులూ, వాళ్ళ ఆటలూ, ఈ ముసలిదాని కబుర్లేం నచ్చుతాయని. దానికి నేనేమీ అననమ్మా. మీ వదిన మాత్రం, పెద్దదాన్ని ఉన్నాగా— కాస్త మంచీ, చెడ్డా చెబితే దాని సాహేబ్యం పోయింది. ఏ విషయం చెప్పదు. ఒకవేళ నేనే అడిగినా విసుగు. అమ్మాయ్యా, నాకు తెలీకడుగుతాను నేను బొమ్మనటే— ఓ మూల మాటా మంతీ లేకుండా పడి ఉండడానికి. నేనూ మొన్నటివరకు ఈ బాధ్యతలు మోసిన దాన్నేగానూ. ఏం నాతో చెబితే అరిగిపోతుందా? మంచి విషయాలైతే విని సంతోషిస్తాను. ఏమైనా క్లిష్ట పరిస్థితిలో నాకు తోచిన సలహానూ ఇస్తాను. నేను అనుభవమున్న దాన్నే కానీ కూచిని కాదు కదా! పోనీ నేనేం సలహా ఇవ్వలేక పోయినా, నా సలహా పాటించక పోయినా కష్టం సుఖం అయిన వాళ్ళుగాక ఎవరితో చెప్పుకుంటారే. ఓపిక ఉడిగే టప్పటికి నేను పరాయిదాన్నయి పోయానా?! ఆ విశ్యం గద్దైతే ఏమైనా మంచి విషయాలు రెండు ముక్కలు దక్కి పోతాడు—అదైనా విని సంతోషించడానికి. మీ వదినేమో నేల కంత మింగుడు పెట్టనంతప్ప నేనో మనిషి మన్నానన్న గుర్తింపే ఉండదు. అప్పుడే అమ్మాయీ తిండి ఒక్కటే బ్రతుక్కి కావలసింది. ఏ వయసు వాళ్ళకైనా ఆత్మీయుల ఆదరాభిమానాలు కావాలే— ఆదరాభిమానాలు. ఇంకంతకంటే ఈ వయసులో కోరేదేముంది?! నాకేముందమ్మా సినిమాలు చూడగలనా, పుస్తకాలు చదవగలనా? ఎంతసేపూ కృష్ణా, రామా అనుకోడానికి నేనేమైనా యోగి నటే. తలుచుకున్నప్పుడు దేవుణ్ణి తలచుకున్నా కాస్త ఇతర విషయాలు కూడా తెలుసు కోవాలని నాకు మాత్రం ఉండదూ. గుళ్ళో పురాణ కాలక్షేపం జరుగుతుంటే పక్కింటి సుందరమ్మ సాయంతో వెళ్ళి వస్తాను. ఆ నాల్గు రోజులూ హాయిగా ఉంటుందనుకో. నా కోసం అస్తమానూ పురాణాలెలా వస్తాయ్. చదువుకుందామంటే కళ్ళావ్

### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్యాలయాలు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన లంద జేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.



### అది గౌరవించే వయసా?

కదా. చెవుడు కూడావస్తే వాళ్ళ విది లింపలూ వినబడవు. ఏమిటి తల్లీ నా సోదితో నిన్ను విసిగిస్తున్నానా'' ముసలావిడ కాస్త ఆగింది.

''లేదమ్మా, లేదు'' అది వనజ ఉలికి పాటుగా. తల్లి సుదీర్ఘమైన మాటల్లో తన మామగారే గుర్తుకొచ్చారు వనజకి. తల్లి లేకపోవడం వల్ల ఉన్న ఒక్క కొడుకుని గారంగా పెంచి పెద్దచేసి తమ దగ్గరే ఉంటున్న మామగారి మనోవ్యథలా అనిపించాయి తల్లి మాటలు తన వయసుకు సహజమనుకున్న అదిరిపాటు, విసుగు నేరాలై తన్ని భయపెడుతున్నాయి. ముసలివాళ్ళు ఇంత వ్యథ ననుభవిస్తారా? కృష్ణా రామా అనుకోక తన కెందుకివన్నీ —అని తనూ మామగార్ని విస్సోసార్లు విసుక్కుంది అనేను అమ్మ అన్నట్టుగా అంతవరకూ సంసార బాధ్యత మోసిన వీళ్ళు, హఠాత్తుగా వైరాగ్యాన్నెలా పొందగలరు. ఈ విసిగిన జీవితంలో ఏమన్నా పొందుతారో, అదీలేదో. అబ్బ ఆ వయసు ఎంత దుర్భరం...

''వనజా, వనజా'' వదినగారి పిలుపు వినబడింది.

''వెళ్ళమ్మా మీ వదిన లేచినటుంది. ఏదో సరదాగా నాల్రోజులు ఉందామని వచ్చిన దానవు ఇవేం మనసుకు పట్టించుకోకు. నీకూ అనవసరపు బాధ. అన్నట్టు— అల్లుడెప్పుడొస్తాడన్నావూ''— మామూలు ధోరణిలో పడ్డ తల్లికేసి జాలిగా చూసింది వనజ.

* * *

ఆ తర్వాత చిక్కిన సమయం తల్లి దగ్గరే గడపసాగింది వనజ. ఏ కబుర్లో చెబుతూనో, ఏ పుస్తకమో చదివి వినిపిస్తూనో తల్లి ఆనందమైన ముఖాన్ని చూస్తుంటే వనజ కెంతో తృప్తికలిగింది. తన మామగార్ని కూడా చేతనైనంత సంతోష పెట్టాలిలాగే అని నిశ్చయించుకుంది. తల్లి కాళ్ళు పడుతున్నప్పుడు, కాళ్ళకి నూనె మర్దన చేస్తున్నప్పుడు తన తల్లి సేవలో మామగార్కి తను చేయవలసిన సేవాధర్మాన్ని జ్ఞాపకం చేసుకుంది. మామగారికి తను మంచి మనసుతో సేవ చేస్తే తన తల్లిక్కడ సుఖపడుతుందేమో అని ఏదో నమ్మకం కలిగింది వనజకు.

రెండు రోజులు మామూలుగా గడిచిపోయాయి. మూడోరోజు రాత్రి భోజనాల దగ్గర—

విశ్వం ఇంకా ఇంటికి రాలేదు. పిల్లలకి, అత్తగారికి భోజనం వడ్డిస్తూ వనజని కూడా పిలిచింది కాంతం. ''వద్దొదినా నేను తర్వాత తింటాలే'' అందామె.

''మీ అన్నయ్య వచ్చేటప్పటికి ఆలస్యం కావచ్చు. మేం ఇద్దరం తింటాంలే, నువ్వు పిల్లలతో తినేయ్'' అంది కాంతం. 'సరే' నంటూ కూర్చుంది వనజ.

తర్వాత కొంచం సేపటికి కాంతం పిల్లలకి పులుసు వేస్తోంది ముసలావిడ ''నాక్కొంచం పులుసేయ్'' అంది. దూరంగా ఉన్న కాంతానికి వినపళ్ళేదు కాబోలు పులుసుగిన్నె పట్టుకొని వంటింట్లోకి వెళ్ళిపోయింది. తల్లికి దగ్గరగానే కూర్చున్న వనజకి వినబడింది కానీ వదినెందుకో వంటింట్లోకి వెళ్ళిందనుకుంది.

### రష్యా టెలివిషన్‌లో కథాకళి నృత్యం

ప్రస్తుతం సోవియట్ యూనియన్‌లో పర్యటిస్తున్న కథాకళి నృత్య సంస్థ అంతర్జాతీయ కేంద్రం మాస్కోలో నృత్య ప్రదర్శన ఇచ్చింది ఈ నృత్య ప్రదర్శన తొలి భాగంలో కథాకళి నృత్య పద్ధతుల గురించి, యీ నృత్యంలోని ముద్రలు, అభినయాల గురించి ప్రేక్షకులకు వివరించడం జరిగింది ద్వితీయ భాగంలో, రామాయణం ప్రాతిపదికగా రూపొందించిన 'తోరణాయుధం' నృత్య నాటకాన్ని ప్రేక్షకులు తిలకించారు. ఈ సందర్భంగా సోవియట్ సంగీత నృత్య సంస్థలు 'కథాకళి' నృత్య రీతి గురించి సవివరంగా తెలియజేసే కరపత్రాలను ప్రచురించారు ఈనృత్య ప్రదర్శనను వీడియో టేప్ మీద రికార్డు చేయడం జరిగింది త్వరలోనే దీనిని సోవియట్ టెలివిజన్‌లో ప్రదర్శిస్తారు.

కాసేపు చూసిన ముసలామె "వనజా, మీ వదిన ఇంకా పులుసు తేలేదు కే" అంది.

వనజ జవాబివ్వబోయేంతలోనే హరి "ఎందుకు తేలేదూ, తెచ్చింది. మా అందరికీ వేసింది కూడాను. నువ్వడగందే ఎలా తెలుస్తుంది. ఏకేం కావాలో మేమే ఊహించుకోవాలా?" అని హేళనగా అన్నాడు.

ముసలావిడ "నేను అడిగానురా బాబూ" అంది నెమ్మదిగా.

"అవునురా, అడిగింది. నేనూ విన్నాను." అంది వనజ.

అంతలో సుశీల అందుకొని "ఆ! ఆవిడేం అడగక్కర్లేదు. అడక్కపోయినా నాకు తప్పుతుందా. ఆవిడకేం లోటులేదు. మేం వచ్చినట్లు అన్నీ ఆవిడ విస్తట్లో పడేస్తాంగా" అంది చిదరగా.

వనజకి కోపం, దుఃఖం, ఉక్రోషం అన్నీ పెనవేసుకొచ్చాయి. "ఏయ్ సురీ, నోరు కాస్త సంభాళించుకో. పెద్దంతరం చిన్నంతరం లేకుండా ఏమిటా పేలాపన?" అంది గట్టిగా.

అంతలో కాంతమ్మ వచ్చి "ఏమైంది వనజా, నువ్వేం కల్పించుకోకు. నేను చెప్పలే వాళ్ళకీ ఆవిడకి అసలు పడదని." అంది.

"ఏమిటొదినా పడక పోయేది? నువ్వు మాట్లాడే దానిక్కూడా అర్థముండాలి! నువ్విలా వెనకేసుకురాబట్టే అదలా పేట్రేగిపోతోంది. ఆవిడ దీని నాన్నకి తల్లని మర్చిపోతున్నట్లుంది. ఆవిడ ఎన్ని కష్టాలు పడకపోతే మేమింత పెద్దవాళ్ళమయాము. దీని కవన్నీ ఏం తెలుసు? ముష్టివాళ్ళని విదిలించినట్లు విదిలిస్తుందా! ఇదేదో సంపాదించి ఆవిడకి పెడుతున్నట్లు, వెధవ విసిరిపాటూ ఇదీను —ఛీ-ఛీ..." అంటూ కోపంగా లేచి వెళ్ళిపోయింది వనజ విస్తరి దగ్గరమండి.

ఇది చూసిన కాంతం కూతురివైపుకి తిరిగి "ఎన్నిసార్లు నీకు చెప్పాను, ఆవిడ విషయం కల్పించుకోవద్దని ఇప్పుడు చూడు, మీ నాన్నకి తెలిస్తే ఎంతగొడవౌతుందో— మనమేదో ఆవిడని రాచి, రంపాన పెడుతున్నట్లు—పాడుగోలని" అంటూ విసురుగా వంటింట్లోకి వెళ్ళిపోయింది. సుశీలకూడా అన్నం దగ్గరమండి లేచి పోయింది. తెల్ల... కూర్చున్నారు మిగతా పిల్లలూ, ముసలావిడా.

తల్లి గుర్తు వచ్చి కొంచెం సర్దుకుని వచ్చింది వనజ. తల్లికి తనే వడ్డిద్దామని వంటింట్లోకి పోబోయినదల్లా సుశీల మాటలకు ఆగిపోయింది. "ఏమిటమ్మా, పెద్ద ఆవిడగారికి భయపడాలా నాల్గు రోజులు ఉందామని వచ్చింది కదా, ఇవన్నీ తన కెందుకు? రోజూ అనుభవించేది మనం. అంత ప్రేమైతే తనతో తీసుకెళమను వాళ్ళమ్మను" చివరన నొక్కుతూ హేళనగా అంది.

వనజ ముఖం ఎర్రబడింది. ఏదో అందా మన్నంత ఆవేశాన్ని అణచుకుని గబగబ శనతిలకి వచ్చేసింది "ఛీ- ఛీ పాడుపిల్ల. దీని వాటికసలు శుద్ధీ, బుద్ధీ ఉందా?! ఇవతలి వాళ్ళ మనసెంత కష్టపడుతుందో అన్న ఆలోచనేనా లేకుండా నోటికెంతొస్తే అంత అనేయడమేనా? పైగా ప్రేముంటే అమ్మని తీసుకెళ్ళ మంటుందా? ప్రేమ లేక కాదని, పెళ్ళయిన ఆడపిల్లకి పుట్టింటి వారిపై ఎంత ప్రేమున్నా, కష్టాల్లో ఆదుకునే స్వాతంత్ర్యము ఉండదని ఈ మొద్దుకెలా తెలుస్తుంది. అసలింత నిర్లక్ష్యం దీనికెలా వచ్చింది. వదిన వెనకేసుకు రావడం వల్లే కదా! పెద్దావిడని అలా అనకూడదని చెప్పడం పోయి మేమే దాన్నేదో అన్నట్లుగా మాట్లాడ తుందా. అందరికోసం ఇన్నాళ్ళూ శ్రమించిన అమ్మ ఓపిక తగ్గేసరికి ఎంత లోకువై పోయింది. పాపం ఆవిడ్ని మాటలతో చంపుతూ, మళ్ళీ చావకుండా వేళకింత తిండి పెడ్తారు కాబోలు. అలాంటి జీవితం పగవాళ్ళక్కూడా వద్దు బాబూ. పెద్దలని గౌరవించాలంటారు. కానీ ఎవరు గౌరవిస్తున్నారూ? అయిన వాళ్ళే చీదరించు కుంటారు. ఇది గౌరవించే వయసా?!! ఇంకొన్నేనిక్కడ ఉండలేను బాబూ. రేపే వెళ్ళిపోవాలి. తర్వాత అమ్మకి బాధ తప్పేటట్లు ఏ ఆశ్రమంలోనో చేర్పించమని అన్నయ్యకి ఉత్తరం రాస్తే సరి. పాపం అక్కడ మామగారు ఒక్కరు ఇంట్లో ఏం అవస్థ పడుతున్నారో ఏమిటో..." వనజ మనసులో పరిపరి విధాల ఆలోచనలు సాగాయి.



## అది గౌరవించే వయసా !

మరునాడే ప్రయాణ మౌతున్న వనజని 'స్యం ఆశ్చర్యంగా అడిగాడు— "అదేమి టమ్మా, ఇంకా నాల్గురోజు లుండవూ. నిన్ను తీసుకెళ్ళడానికి బావగారు వస్తారు కదా. రాక రాక వచ్చిన దానవు, అప్పుడే ప్రయాణాని కేం తొందర ?!"

"లేదన్నయ్యా, నేను వెళ్ళి పోవాలి. నిన్ననే ఆయన దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. మామయ్యగారికి ఒంట్లో బాగుండ లేదట. పాపం ఆడతోడు లేదు. ఏం అవస్థ పడుతున్నారో ఏమిటో. నేను వెళ్ళి పోతా నన్నయ్యా" అన్నయ్య నొచ్చుకోకుండా అబద్ధమాడింది.

ఏ ఉత్తరమూ రాలేదని తెలిసిన కాంతమ్మ, పిల్లలు ఏమీ అనలేక అవహా ధుళ్ళా ఉండిపోయారు.

తల్లి దగ్గరకు వెళ్ళి కాళ్ళకు నమస్క రించి కన్నీళ్ళు పెట్టుకుంది వనజ. "అదేమిటే తల్లీ, ఇంత అర్ధాంతరంగా ప్రయాణమౌతున్నావు ? నిన్నదేం మనసులో పెట్టుకోలేదు కదా. నా కలవాటేలే ఇది. ఏమైనా ఎవరికర్మ వాళ్ళనుభవించవల సిందే. నువ్వు నాగురించేం దిగులు పెట్టు కోకు. సరదాగా అన్నయ్య వాళ్ళతో నాల్గు రోజులు ఉండు. అబ్బాయి వచ్చి నిన్నెలాగా తీసుకెళ్తాడు కదా !" అంది ముసలావిడ కూతురి హఠాత్తు ప్రయాణానికి బాధ పడుతూ.

"అహా, అదేంకాదమ్మా, నిన్న ఉత్తరం వచ్చింది. అన్నట్టు నీకు చెప్పడం మరచి పోయాను. మామయ్యగారి ఆరోగ్యం సరిగా లేదుట నేను వెళ్ళకపోతే ఎలా చెప్పు" అంది.

"అయ్యో, అలాగుటే అమ్మా ! అయితే వెళ్ళాలిలే. మళ్ళీ ఎప్పుడొస్తావో ఏమో. ఈసారి అబ్బాయితో కలిసిరా. మళ్ళీ వచ్చి నప్పుడు శుభవార్తతో రావాలి సుమా. మీ మామగారికి ముసలి వయసులో తోడుగా మనవడుండొద్దూ. అన్నట్టు మీ మామ గారి ఆరోగ్యం సంగతి వెళ్ళగానే ఉత్తరం వ్రాయి." ఆప్యాయంగా కూతురి తల నిమిరింది.

"అలాగేలేమ్మా. వస్తానూ. నీ ఆరో గ్యం జాగ్రత్త. వాళ్ళ మాట అసలు విన్పించుకోకు. పిల్లలకేం చెప్పకు. పెద్ద




ప్రజలు మిమ్మల్ని మెచ్చితీరేందుకేమరి

# మధురా బట్టలు

మధురా కోట్స్ ఉత్పాదన

మధురా సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రై.) లిమిటెడ్ 68, మూర్ స్ట్రీట్, మద్రాసు 600 001. శ్రీ లక్ష్మి టెక్స్‌టైల్స్ బెసెంట్ రోడ్, గవర్నర్ పేట, విజయవాడ 520 002.

378 TEL

## అది గౌరవించే వయసా?

వాళయ్యారు. వాళ పనులు వాళు చేసుకుంటారులే. వెళ్ళొస్తానమ్మా" తల్లి భుజంమీద చేయివేసి తల్లికేసి ప్రేమగా చూస్తూ అంది వనజ.

"నా గురించి నువ్వేం బెంగపడకని చెప్పానా, నాకేం పర్వాలేదు. నేను బాగానే ఉంటాలే...ఉండమ్మా, నేనూ గుమ్మం వరకూ వస్తాను" అంటూ లేచింది ముసలామె.

తల్లితో కలిసి వీధిగుమ్మం వరకూ వచ్చింది వనజ. "కాంతం, అమ్మాయికి చీర తెచ్చావుటే. పసుపు కుంకం ఇచ్చావా" మాములు ధోరణిలో అడిగింది మళ్ళీ ఆవిడ. "ఆఁ" అంది నోరు పెగలని కాంతం.

మళ్ళీ వనజ దగ్గరకొచ్చి "వనజా, నువ్విలా అనుకోని ప్రయాణం జేయడం నాకేం బాగుండలేదు. వెళ్ళగానే ఉత్తరం వ్రాయి" అంది

"అవునే అమ్మాయి, ఉత్తరాలు వ్రాస్తూండు. అవి చూస్తే నిన్ను చూసినట్లే ఉంటుంది' అంది ముసలామె.

"ఇదిగో వనజా, ఈ నూలేభై పెట్టి చీర కొనుక్కో నువ్వింకా ఉంటావను కున్నాను. కొనడం పడనేలేదు. వెళగానే మీ మామగారికెలా ఉందో వ్రాయి. జాగ్రత్తగా వెళ్ళు. స్టేషన్ దగ్గరనుండి మీ ఇంటికి వెళ్ళగలవుగా. ఏమిటో అనుకోని ప్రయాణం. ఒక్కదానివే వెళ్ళడం" ఆప్యాయంగా అన్నాడు విశ్వం.

"వెళ్ళగలనులే, కానీ, ఎందుకన్నయ్యా ఈ డబ్బిప్పుడు..." ముఖమాటంగా అంది వనజ.

"ఆఁ, అలా అవకూడదే అమ్మాయి. 'ఏడుగురు అన్నదమ్ములకు పుట్టినోస్తివి దేవా' అన్నారు. వాళ్ళకిచ్చే బాధ్యతా ఉంది. నీకు తీసుకునే హక్కూ ఉంది. అడిగి తీసుకోవాలసలు తెలుసా. తీసుకో అమ్మా" అంది ప్రేమగా కూతురితో ముసలావిడ.

"అమ్మకి అన్నీ చెప్పే అలవాటూ మానదు. వాళ్ళు వినుకోకా మానరు. హు, ఏమిటో ఆ వయసు ?!!" అనుకుంటూ రిక్షాదగ్గరకు నడిచింది వనజ

## వారఫలం

**7-12-1979 శుక్రవారం మొదలు**
**13-12-1979 గురువారం వరకు**

**మేషం :** ఇబ్బందులు ఒకదాని వెంట ఒకటిగా తీరిపోయే గ్రహానుకూలత గలదు. అయితే, చేసిన పొరపాట్లే మరల మరల చేయుచున్నప్పుడు, రావటం కొంత విసుగు కలిగించక మానదు. వారాంతానికి గ్రహానుకూలత మేర ఆదాయం, అవసర వ్యయానికి సరిపడా రావటం మీరు గ్రహించగలరు. పత్రికా, గ్రంథ రచనా, వ్యాసంగం, చిత్రరంగానుభవం గల వారికి మరీ అనుకూలం. స్త్రీలకు :— అనుకోకుండా ద్రవ్యసంభవం, ఉద్యోగాభివృద్ధి గలదు.

**వృషభం :** ఆదాయం కన్నా మీకు వ్యయం అధికం. అనుకోనివి ఖర్చులు వెంటబడతాయి. అయినా, వస్తు, వస్త్ర సేకరణకు మీకు అనుకూల కాలం. అధిక వ్యయాన్ని ఎలాగో అధిగమించగలరు. ఆరోగ్యలోపం లేదు. అనుకున్న కార్యాచరణకు అంతరాయముండదు. ముఖ్యమైన అగ్రిమెంట్లు కావించుటకు అనుకూల కాలం. వారాంతానికి ఆశించిన ప్రతిఫలం తప్పదు. ఆర్థికంగా ప్రోత్సాహకరమే. స్త్రీలకు :—ముఖ్య రంగాలలో ప్రోత్సాహం. ప్రాముఖ్యత కలదు.

**మిథునం :** నూతన కార్యాచరణ గావింపనున్నారు. నీచసంపర్కం, విరోధి వర్గీయుల ఒత్తిడి కొంచెం మానసికానందానికి, అంతరాయం కలిగిస్తుంది కూడ. నిరుద్యోగులకు, చాల అవకాశాలుంటాయి. ఋణదాతల ఒత్తిడి మాత్రం అధికం. ఏమైనా రాబోయే వారం సర్వానుకూల ప్రదం గావున, పెద్దగా ఆందోళన పడవలసిన పరిస్థితులుండబోవు. వాలమందికి ఈరాశివారికి, ప్రమోషనులో, ప్రగతియో కనిపించవచ్చు. స్త్రీలకు:— వారమంతా శుభప్రదమే.

**కర్కాటకం :** మీరు గావించే ప్రయత్నాలలో అనుకూలత గలదు. గ్రంథ విక్రేతలకు, పత్రికావ్రతలకు, వ్యాపార దక్షత గలవారికి కొంత అనుకూల వారమే. అవసరంగా ఇతరులకు మేలు గావించాలని, మంచి పెంచుకోవాలని, ప్రయత్నించి మనస్తాపం తెచ్చుకోకండి. నీచ గ్రహస్థితి అంతపనిచేస్తుంది. ఆరోగ్య విషయంలో ఎంతైనా శ్రద్ధవహించటం మేలు. స్త్రీలకు: గృహకార్యభారం తప్ప ఇతర రంగాలలో అనుకూలత గల వారమే.

**సింహం :** మీ ప్రయత్నాలు అన్నీ సుసుఖంగా నెరవేరుతాయని మీరు ఆశింపరాదు. పూర్వ ఫలాలు గమనించి మెలగండి. కానివారి పోరు తప్పించుకొనుట కష్టం. వార ద్వితీయభాగంలో ఆర్థికంగా కొంత అనుకూలత పొందనున్నారు. కృషి ఫలించి, మనోరథం సఫలమయ్యే వారం. దైవకార్యానుకూలత, పెద్దల అనుగ్రహం సమకూరుతుంది. స్త్రీలు తాముచేసే ప్రయత్నాలలో లాభం పొందగలరు.

**కన్య :** ఏది సఫలం కావాలనుకుంటారో, ఏది విక్రమంగా నెరవేరాలనుకుంటారో, దానికే అంతరాయం, మానసికంగా బాగుండదం వాను. ఆర్థికంగా ప్రోత్సాహకరమే. మిత్ర సంభాషణం, బంధుప్రీతి మాత్రం ఉత్సాహకరంగా, రూపాపారం ఉండగలదు. స్త్రీలకు :—యత్నలోపము చే తప్ప, కార్యానుకూలతకు లోటులేదు.

**తుల :** మీరు స్వయం కృషిచే అనేక పనులు సాధింపగలరు. భరీవ్యాపారం, జాయింటు వ్యాపారం శోభాయమానంగా ఉండగలదు. ఏదో ఒక విధంగా వ్యయాన్ని సూచించేవారం. ముందుమను

## ధర్మపథం

### కాషాయవస్త్రాలెందుకు?

సన్న్యాసులందరూ తెల్లని వస్త్రాలను ధరించక కావి వస్త్రాలనే ధరిస్తారు. వారు కాషాయ వస్త్రాలనే ఎందుకు ధరించాలి? అనే సందేహం కొందరికి కలుగడంలో తప్పులేదు.

అట్టి సందేహమే ఒకప్పుడు ఒక విద్యావేత్తకే కలిగింది. ఒకనాడు కలకత్తాలో పరమహంస ప్రియ శిష్యులు స్వామి వివేకానందులు కాషాయ వస్త్రాన్ని ధరించి వెళ్ళుతూ ఉండగా చూచి "స్వామీ! ఇలా అడుగుతున్నందుకు క్షమించాలి మీ సన్న్యాసులు కావి బట్టలనే ధరిస్తారు. అది మీ ప్రత్యేకతకు చిహ్నంగా ఉంటున్నది గదా! ఇతరు లందరికంటె నేను అధికుడననీ, లోకంలోని వాటన్నింటితోనూ సంబంధం విడిచి పెట్టిన సర్వసంగ పరిత్యాగిననీ, నాకు ఏ వంటి కోరికలు లేవని ఈ కాషాయ వస్త్రం మూలంగా సన్న్యాసులు ప్రకటన చేస్తున్నారని అనుకోవలసి వుంటున్నది. ఇది అహంకారానికి చిహ్నంగా ఉండడం లేదా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు స్వామి చిరునవ్వు నవ్వి ఇలా అన్నారు "ఓయీ! నీవు అనుకుంటున్నది పొరపాటు. ఇది అహంకారానికి సూచకమైనది కాదు. తమ గొప్పతనాన్ని ప్రకటించాలనే ఉద్దేశంతో సన్న్యాసులు కాషాయ వస్త్రాలను ధరించలేదు. కావి గుడ్డలు లేమిని సూచిస్తాయి. మంచి దుస్తులు వేసుకున్న వానిని— ధనికుడనుకొని— ఎవరైనా యాచించవచ్చును. కాషాయ వస్త్రధారిని చూచి "వీడొక బోడి సన్న్యాసి. వీణ్ణి యాచిస్తే ఏమి లాభం?" అని యాచకులు దూరంగా తొలగిపోతారు. అందువల్ల యాచకుల బాధ ఉండదు. తన్ను ఎవరైనా దోచుకొంటారనే భయం వుండదు. నిర్భయంగా సంచరించవచ్చును. ఏ మఠంలోనైనా రాత్రి నిర్భయంగా— నిర్విచారంగా నిద్రించవచ్చు.

అయితే— సన్న్యాసిదగ్గర ఆధ్యాత్మిక సంపద సమృద్ధిగా ఉంటుంది. సంపద ఉన్నవాడు— ఖర్చయిపోతుందేమో అనే భయంవల్ల ఎవ్వరికీ ఇవ్వడానికి ఇష్టపడడు. ఆధ్యాత్మిక సంపద ఉన్నవాడు సంతోషంతో దానిని ఇతరులకు ఇవ్వడానికే ఎప్పుడూ సంసిద్ధుడయి వుంటాడు.

కాషాయ వస్త్రధారణ ఈ విషయాలనే వ్యక్తం చేస్తూ ఉంటుంది ఆత్మాధిక్య ప్రకటన, అహంకార ప్రకటన దాని లక్ష్యం కాదు.

ఈ ఉద్దేశంతోనే సన్న్యాసులకు కాషాయ వస్త్రధారణ విధింపబడినది."

ఆ సమాధానం విని ఆ వ్యక్తి తల వంచుకొన్నాడు. "స్వామీ! నాలో బాధిస్తున్న సంశయం తీరిపోయింది. మీకు కృతజ్ఞుణ్ణి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

*— బులుసు వేంకటరమణయ్య*

చూపుకీ
అందం
కంటికి
చలవ

అదే
# ఐటెక్స్
కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనంగాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్ళగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి అదే ఐటెక్స్ కాటుఁ అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033

# హైదరాబాద్ నోట్ బుక్

**నిరసనల వారం :**

నవంబర్ మొదటి వారాన్ని నిరసనల వారం అంటే తప్పు లేదు. ఎటు చూసినా బందులు, ఎటు వెళ్ళినా ప్రదర్శనలు! ఎటువిన్నా నినాదాలు! రోడ్డు రవాణా సంస్థ హమాలీ అంజయ్యను పోలీసులు కొట్టి చంపేరని నవంబర్ 4 వ తేదీన ప్రజలు ఆగ్రహావేశంతో అఫ్జల్ గంజ్ పోలీస్ స్టేషన్ ముందు ప్రదర్శనం చేశారు. పి.డి. గూండా ఆర్డినెన్సుకు 5వ తేదీన ప్రతిపక్షాలు చార్మినార్ వద్ద బహిరంగ సభ జరిపి అంజయ్య మరణంపై న్యాయవిచారణ జరపాలని ప్రభుత్వాన్ని కోరారు. ప్రతిపక్షాల పిలుపుపై 6 వ తేదీన రాష్ట్రమంతటా బంద్ జరిగింది. జంటనగరాల్లో దుకాణాలు — చివరకు కిళ్ళీ బడ్డీలు, టీ దుకాణాలు కూడ మూసి వేశారు. సినిమా హాళ్ళు మూసి వేయడం విశేషం. సాంకేతిక కళాశాలల్లో కాపిటేషన్ పద్ధతిని నిషేధించాలని కోరుతూ విద్యార్థులు 7 వ తేదీ ఉదయం సాంకేతిక శాఖామాత్యులు శ్రీ టి. హయగ్రీవాచారిని చుట్టుముట్టి రెండు గంటలసేపు ఆయనతో వాగ్వాదం జరిపి, క్యాపిటేషన్ ఫీజు పద్ధతిని నిషేధించలేక పోతే మంత్రి పదవిని త్యజిస్తానని ప్రామిస్ చేయించుకొని వదిలారు. ఇంత అల్లరి జరిగినా పోలీసుల జోక్యం వద్దని శ్రీ హయగ్రీవాచారి నిబ్బరంతో వుండడం ఆయన ప్రజా సన్నిహితత్వాన్ని నిరూపిస్తున్నది. 6 వ తేదీన ఒ.పి.డి.ఆర్. ప్రదర్శకులు సచివాలయం వద్ద ప్రదర్శనలు జరిపారు. అధిక ధరలకు, విదేశాలకు ఉల్లిగడ్డల ఎగుమతికి నిరసనగా మహిళలు రెండు సార్లు ప్రదర్శనలు జరిపారు. ప్రాథమికోపాధ్యాయులు సావధాన దినం జరిపారు.

**రాష్ట్రావతరణ దినోత్సవం :**

రాష్ట్రావతరణ దినోత్సవం ఎప్పటిలాగే కవి సమ్మేళన భువన విజయాలతో ప్రారంభమయింది. రవీంద్ర భారతిలో నవంబర్ 1 వ తేదీన ఉదయం ఈ రెండు జరిగాయి. కవి సమ్మేళనానికి ఆస్థాన కవి శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు అధ్యక్షత వహించారు. పలువురు కవులు నేటి కలుషిత రాజకీయాలను, సంఘ దయనీయ స్థితిని ఎండగట్టారు. శ్రీ కుందుర్తి అభ్యర్థి అనే వచన కవిత శ్రోతల మన్ననలను విశేషంగా పొందింది. రాజకీయ నాయకులు ఓట్లకోసం అభ్యర్థిగా వెళ్ళే తీరును శ్రీ కుందుర్తి వ్యంగ్యంగా చిత్రించారు. కవి సమ్మేళనాన్ని సాంకేతిక విద్యాశాఖామాత్యులు శ్రీ టి. హయగ్రీవాచారి నిర్వహించారు. సమ్మేళనం శ్రీ తిరుమల రామచంద్ర సంస్కృత కవిత ఆంధ్రప్రదేశ ప్రగతి: తో ప్రారంభమయింది. శ్రీయుతులు దాశరథి, నండూరి కృష్ణమాచార్యులు, లక్ష్మీ, గులాం యాసీన్, ఎల్. మాలకొండయ్య, గంగిసెట్టి లక్ష్మీనారాయణ, ముకురాల రామారెడ్డి, బి.ఎన్. రెడ్డి, వడ్డేపల్లి సత్యరి, డక్టర్ పి. నారాయణ రెడ్డి, డక్టర్ యశోదారెడ్డి, డక్టర్ బోయి భీమన్న, కుందుర్తి ఆంజనేయులు కవితలు చదివారు. మంత్రి శ్రీ హయగ్రీవాచార్యులు కవులను శాలువలతో సత్కరించారు. తర్వాత జరిగిన భువన విజయం ప్రేక్షకులను బాగా ఆకరించింది. శ్రీ కృష్ణదేవరాయల పాత్రను ప్రముఖ న్యాయవాది కోకా రాఘవరావు నిర్వహించారు. డాక్టర్ దివాకర్ల వెంకటావధాని, శ్రీయుతులు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, కె. రాజన్న శాస్త్రి, ఉత్పల సత్యనారాయణాచార్యులు, వేదవంతుల నరసింహ శాస్త్రి, ముదిగొండ వీరభద్రమూర్తి, డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం, డక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులు అష్టదిగ్గజాలుగా వెలిగొన్నారు. రాష్ట్ర సాహిత్య అకాడెమీ కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి తిమ్మరుసు పాత్ర నిర్వహించారు. విద్యాశాఖామాత్యులు శ్రీ భవనం వెంకటరామరెడ్డి అష్టదిగ్గజాలను సన్మానించారు.

**ప్రపంచ తెలుగు మహాసభ :**

ద్వితీయ ప్రపంచ మహాసభ వచ్చే ఏప్రిల్ 15 నుంచి 19 వరకు కోలాలంపూర్ లో జరుగుతాయని మహాసభ కార్యనిర్వాహకాధ్యక్షుడు శ్రీ మండలి కృష్ణారావు నవంబర్ 1 వ తేదీన విలేఖరుల గోష్ఠిలో తెలిపారు. ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలో జరిగిన నాటి నుంచి ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో వున్న తెలుగు వారితో సన్నిహితత్వం సంపాదించుకొనడానికి జరిగిన చర్యలను శ్రీ మండలి వివరించారు. సుమారు 700 మంది ప్రతినిధులు ఈ మహాసభకు హాజరవుతారని, వీరిలో 400 మంది మన రాష్ట్రం వారు వుంటారని, ఈ సభ సందర్భంగా వందమంది కళాకారులను మలేషియాకు పంపుతామని ఆయన తెలిపారు. మలేషియాలో లక్షన్నర మంది తెలుగు వారున్నారు. ప్రపంచ తెలుగు మహా సభ మలేషియా విశ్వవిద్యాలయంలో జరుగుతుంది.

**ఉత్ప్రేక్షి :**

నా పేరు, అన్నాను. రామ్ పర్షాద్ — అన్నా డా యువకుడు. ప్రసాద్ అనరేమా: అన్నాను. పక్కనే ఉన్న డాక్టర్ జీనత్ఆపా అన్నారు, పర్షాదే కరెక్టని. ఎందుకన్నాను. మహా కవి మహారాజా కిషన్ ప్రసాద్ ప్రయోగం వుంది. అంటూ ఆమె ఒక ద్విపద ఉదాహరించారు.

ఆప్ అల్లా పర్ షాద్ హై
మై కిషన్ పర్షాద్ హూం.

ఇక్కడ పర్షాద్-పై శ్లేష. షాద్ అంటే ప్రీతిగలవారు. మీరు అల్లా పై ప్రీతిగలవారు. నేను కృష్ణుని పై ప్రీతి గలవాడిని. పర్షాద్ లేకపోతే ఈ కవితా సౌందర్యం రాదని అన్నారు ఆమె.

— తిరుమల రామచంద్ర

# హార్లిక్స్

## మీకు ఎక్కువగా అవసరమయినప్పుడు శక్తినిచ్చే కీలకపోషక పదార్థం.










### గర్భవతిగా ఉన్న కాలంలో

గర్భిణీ స్త్రీకి మంచి సమతూకంలో ఉండి, తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం అవసరం. అందువల్లనే గర్భిణీగా ఉన్నప్పుడు హార్లిక్స్ ఆదర్శప్రాయమయిన ఆహారం. ఇది తల్లికి, పిల్లకి కూడా శరీర నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, కార్బోహైడ్రేట్లు సరిఅయిన సమతూకంలో సమకూరుస్తుంది. రాత్రిళ్ళు సేవించిన మలబద్ధకం ఉండదు. ఉదయమే నిస్సత్తువగా ఉండటం పోతుంది.

### అస్వస్థత / అస్వస్థనుంచి కోలుకునే కాలంలో

జబ్బు చేసినప్పుడు మీ శరీరం ఎంతో విలువయిన మాంసకృత్తులు, పోషక పదార్థాలు కోల్పోతుంది. దీనివల్ల నిస్సత్తువ ఏర్పడుతుంది. ఈ నష్టాలను భర్తీ చేసేందుకు హార్లిక్స్ తేలిగ్గా జీర్ణమయ్యే రూపంలో శరీర కణాల నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లు ఖనిజాలు సమకూరుస్తుంది. దీనివల్ల మీరు త్వరగా కోలుకొంటారు. మళ్ళీ జబ్బు పడకుండా తట్టుకునే శక్తి ఏర్పడుతుంది.

**ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేశారు**

**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్

ఢిల్లీలో కర్ణాటక సంగీత సంప్రదాయానికి ఒక పట్టుకొమ్మ షణ్ముఖానంద సంగీత సభ. ప్రతి సంవత్సరం శరన్నవరాత్రులకు, రామనవమి సమయాలలో రసజ్ఞుల యింద్రియాలకు తనివి తీర విందుగొలిపే కార్యక్రమాలు ఏర్పాటుచేస్తూ వుంటారు. ఈ సంవత్సరం జరిగిన కార్యక్రమంలో శ్రీయుతులు ఎం. ఎస్. గోపాలకృష్ణన్, మహారాజపురం సంతానం, చిత్రా విశ్వేశ్వరన్, శోభానాయుడు పాల్గొన్నారు. రాజధాని మావ్‌లంకర్ హాల్‌లో జరిగిన యీ ఉత్సవాలకుజనం నిండుగానే వచ్చారు.

స్వర్గీయ సుందరరామయ్యరు కుమారులైన శ్రీ గోపాలకృష్ణన్ వయొలిన్ వాద్యంలో నిష్ణాతులు. రాగాలాపనలో అలవోకగా మీటుతుంటే తేనె సోనలు జాలువారినట్లు, వెన్నెల వాకలు ముంచెత్తినట్లు, పరిమళాలు గుబాళించినట్లు తన్మయం చెందింప చేయగలరు. ఎత్తుగడలోనే శ్రోతలు రసహారవ్యం పొందిన ట్లనిపిస్తుంది. అయితే పాండిత్య గరిమతోబాటు గమకాల అపురూత్యంతో సరాలు బిగ పట్టించ గలరు. ఇటీవల కొన్ని రాగాలను కర్ణాటక— హిందూస్తానీ సంప్రదాయాలు మేళవించి అందిస్తున్నారు. ఇంకా యీ ప్రయత్నపు ఫలితాల కోసం కొంతకాలం వేచి వుండాలి. కార్యక్రమంలో హిందోళ, శివరంజని, రసికప్రియ విశేషంగా శ్రోతల మన్ననలు పొందాయి. మహారాజపురం సంతానం కే. శే. విశ్వనాథం కుమారులు. ఎంతటి శృతినైనా అందుకొనగల నిండైన కంఠం. నాలుగు గంటలు నల్లేరు మీద బండిలా పాడగలరు. ఇది వరకు కొన్ని పర్యాయాలు వారి కార్యక్రమం వినే అవకాశం కలిగింది. అందుచేత యీ పర్యాయం కొంత నిరాసక్తంగా నిర్వహించారని చెప్పగలుగుతున్నాను. అయినప్పటికీ, ఉన్నత శ్రేణికి చెందిన కళాకారులందరి వలె సభను తల్లిగా, ఒడగా, భక్తునిగా, దైవంగా, ప్రియురాలుగా యింకా పలు రూపాలలో అలరించాలనే పట్టుదల కార్యక్రమంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. సింధుభయిరవి, బృందావన సారంగ, రాగమాలికలు విశేషించి—జనానికి నచ్చినట్లనిపించింది.

మూడవ రోజు భరత నాట్యం శ్రీమతిచిత్రా విశ్వేశ్వరన్ నిర్వహించింది. నిగ్రహం గల అభినయం. ముద్రలు కూడా పరిణతిని ప్రదర్శిస్తున్నాయి. బాల సరస్వతి, వైజయంతీ మాల వంటి వార్ల భంగిమలు అక్కడక్కడ దీపింపచేసింది. [అదే రోజున ఢిల్లీలోనే మరొక సమావేశ సభలో యామినీకృష్ణమూర్తితో ఒగల్ బందీ జరగడం వల్ల కొంత ప్రేక్షకుల దృష్టి అటు మళ్ళిందేమో చెప్పలేం.] ఆమెకు మంచి గాయకులు,వాద్యగాండ్రు లభించారు. ప్రేక్షకులు అందువలన కొంతసేపు కేవలం శ్రోతలుగా మారిపోయారు. గురువు మీద భక్తి వల్ల సభాసదులను కించపరచవలసిన అవసరం లేదని ఆమెకు తెలియదను

# ఢిల్లీలో భువన విజయం

కోవడం మన పొరపాటు. అయినా కొన్ని కొన్ని సన్నివేశాలలో, ముఖ్యంగా రక్తి కట్టించవలసిన చివరి తరుణంలో ఆ విధంగా ఎందుకు జరిగిందో తెలియదు. చివరి రోజు కుమారి శోభానాయుడు కూచిపూడి ప్రదర్శించింది. శివతాండవం, భామా కలాపం, కృష్ణ లీలలు, దశావతారాలు వంటి అంశాలు ప్రదర్శించింది. దేవులపల్లి వారి గేయానికొక దానికి రూపకల్పన చేసింది. అభినయంలో వేగం, రసావిష్కరణ కోసం పట్టుదల ద్యోతక మవుతాయి. అయితే సభలో అధిక సంఖ్యాకులు తమిళులు, కావడం వలన సాహిత్యం అంతా కాక పోయినా ఎక్కువ భాగం తెలుగ అవడం చేత సమగ్ర ఫలితం, కేవలం అభినయపు ప్రభావం కంటే. తక్కువే అని చెప్పాలి. అయితే వినయంతో, చలాకీ తనంతో, భావ ప్రదర్శనంతో ప్రేక్షకులను ఎత్తులకు తీసుకు వెళ్ళ జాలిన కళాకారిణి. పాదాల కదలికలు కొన్ని చోట్ల తాళంతో మేళ వింపు జరగలేదు ఆ రోజున ఆమె ఆరోగ్యం సరి లేనందున సంతృప్తి కరంగా చేయలేక పోయానని యీ రచయితకు తెలియజేసింది. శ్రీ వెంపటి చినసత్యం శిష్యురాలైన యీమెకు ముందుముందు మంచి భవిష్యం కలదని చెప్పవచ్చు. నిర్వాహకులు శ్రీ జి. కె. రాజగోపాలన్, పి. శేషాద్రి అభినంద నీయులు.

కార్యక్రమాలు ముగిసిన తర్వాత ఒక రోజు భారతీయ విద్యాభవన్‌లో గీతోపన్యాసాలకు వెళ్ళడం జరిగింది. జనం నిండుగా వచ్చారు. జీవితపు వేగం అందుకుని ముందుకు సాగిపోవాలనే తహతహలో అలిసి పోయినవారు, పదవీవిరమణ చేసిన వారు, జిజ్ఞాసాపరులు, కాలక్షేపం కోసం వచ్చేవారు— అనేక రకాలున్నారు. అయితే ఎంపు పల్లినో ఉపన్యాసకుడు. శ్రోతల మీద పూర్తి ప్రభావం చూపలేదు. తన అనుభవ సిద్ధమైన జ్ఞానాన్ని యితరులతో పంచుకోడానికి యిష్టం లేకో, శ్రోతలకు కావలసిన రీతిలో కాకమ్మ కబుర్లతో దైనందిన ఉదాహరణలతోనే ప్రసంగం కొన సాగించాలనే తలంపువల్లనో మనస్సు మీద అంత ప్రభావం చూపలేదు. అంతకంటే గీతా గానం కొంత అలౌకికత నుద్దీపింప జేసింది. సిద్ధికి యితర మార్గాలకంటే నాదోపాసన ప్రకృష్టం అని లగుపెస్తున్నది.

ఢిల్లీలో దుమ్ము అణిగి చిరుత చలి రెక్కలు విప్పుకుని మంచు తెరలు నెమ్మదిగా జాలువారు తున్నాయి. కళలకు, ప్రసంగాలకు, కావలసినంత ఉత్సాహం, అవకాశం. రాజకీయాల సంగతి చెప్పనే అక్కర్లేదు. అయితే ఎదుగుతున్న ధరలతో పెరుగుతున్న నిరుద్యోగ సమస్యతో అనిశ్చిత రాజకీయ పరిస్థితులతో — యీ శీతాకాలం ఎట్లా వుంటుందో మరి.

—'శ్రీ కృష్ణ.'

# ఉత్తరాలు

## ముఖచిత్రం

రీనా ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్రవార పత్రిక మనోహరంగా ఉంది. 'ప్రేమపాశం' సీరియల్ ముగింపు అనుకోని విధంగా ముగిసింది. శాంతి చనిపోతుందనుకోలేదు. ఏది ఏమైనా శాంతి, జానకి రెండు పాత్రలు ఒకదానితో ఒకటి పోటీపడ్డాయి. శాంతి నిష్క్రమణ ఎంతో బాధ కలిగించింది. ఇటువంటి సుదతులు ఉన్నారా ఈ లోకంలో అని ఆశ్చర్యం కలుగుతోంది. ఇంతమంచి సీరియల్‌ను అందించినందుకు ఎడిటర్‌గారికి కృతజ్ఞతలు. సుదూర తీరాలు సీరియల్ ఇంట్రెస్టింగ్‌గా సాగుతోంది. దీపావళి కథలపోటీకి ఎన్నుకోబడ్డ 5 కథలూ దేనికదే ఒక ప్రత్యేకతను సంతరించుకొని ఎంతో బాగున్నాయి. ఎడిటర్‌గారి ఎన్నిక మెచ్చదగ్గది.

విజయ, ప్రమీల, గ్రేస్‌సామ్యూల్ [జమ్మలమడుగు]

## కథలు

9.11.79 ఆంధ్రపత్రిక [వీక్లీ]లో 'ఎవరిది నేరం' కథ ఇతివృత్తం సహజమైనది. రచయిత చక్కగా రాశారు. ప్రొక్టీన్ పెట్టిచూడు సీరియల్ కొరకు 23.11.79 సంచిక ఎప్పుడు వస్తుందా అని చూస్తున్నాం.

కాచం రమేష్ [పరకాల]

* * *

9.11.79వ తేదీ ఆంధ్రసచిత్రవారపత్రికలో "ఎవరిదీనేరం" అనే కథ చాలా బాగుంది. ఆహారపు విలువలను గురించి శ్రీ బులుసు వెంకటరమణయ్య గారు ధర్మపథంలో చాలా చక్కగా వివరించిచెప్పినారు.

సందిగాపు మదనమోహన్‌కృష్ణ [హైదరాబాద్]

## సీరియల్

ప్రేమపాశం సీరియల్‌లో రచయిత్రి గారు 'శాంతి' పాత్రను వాస్తవికతకు, సుదూరముతో ఉంచితే, మరొకపాత్ర 'జానకి'ని వాస్తవికతకు అతి దగ్గర్లో ఉంచి, రెండుపాత్రల పట్ల కూడా పాఠకులకు జాలిగొల్పేట్లు చిత్రించారు. సీరియల్ మొదటి నుండి చివరివరకు కూడా చాలా బాగుండినది. రచించిన శ్రీమతి ప్రమీలా జనార్దన్‌గారికి ప్రచురించిన మీకు మా అభినందనలు. 'సుదూరతీరాలు' మొదటి నుండి కూడా ఇంట్రెస్టుగా సాగుతున్నవి.

సూర్యనారాయణరెడ్డి, పి. నారాయణరెడ్డి,
సి. కొత్తపల్లి [కడప].

* * *

'ప్రేమపాశం' సీరియల్ మా మనస్సుకు హత్తుకున్నట్లుగా ఉన్నది. సినిమా విశేషాలు బాగున్నాయి.

కుమారి కె. రాగిణి [రాజమండ్రి]


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

# విపుల జీవనస్రవంతి...!

ఈ 'విపుల' ప్రపంచం ఒక పెద్ద మ్యూజియం వంటిది. దాన్ని దర్శించటం, అధ్యయనం చేయటం, అవగాహన చేసుకుని ఆనందించటం అందరికీ సాధ్యం కాదు. ఎంత ఆసక్తి ఉన్నా ఎవడూ కూడా ఈ విశాల విశ్వాన్ని ఛాయా మాత్రంగానైనా చుట్టిరాలేరు.

కానీ...అసంభవాలను సుసంభవం చేసే అద్భుత ప్రయోగం విపుల. అనతి కాలంలోనే అశేష పాఠకులను ఆకట్టుకుని తెలుగు మాసపత్రికలలో అగ్రశ్రేణిని అందుకున్న విశిష్ట కథా వేదిక 'విపుల'. వివిధ భారతీయ భాషలలోని, ప్రపంచ భాషలలోని ఉత్తమ కథలకు వేదిక విపుల. జాను తెనుగు అనువాదాలతో అచ్చ తెలుగు కథల్లాగే పాఠకుల్నాకట్టుకుని విశ్వ విహారం చేయించే ఏకైక మాస పత్రిక విపుల.

ప్రతి నెలా కనీసం పదిహేను వివిధ భాషల కథలను అందిస్తోంది విపుల. తెలుగు, తమిళం, హిందీ, ఉర్దూ, కన్నడం, మలయాళం, సింధీ, కాశ్మీరీ, గుజరాతీ, అస్సామీ, ఒరియా, నేపాలీ, మరాఠీ, జర్మన్, ఫ్రెంచి, రష్యన్...ఒకటేమిటి?...విపుల భాషా పరిధి అనంతం. విపుల ఎన్నిక అనన్యం.

కథలుకాక మరెన్నో కార్టూన్లు, జోకులు, విచిత్ర విశ్వ విజ్ఞానం కూడా అందజేస్తోంది విపుల. రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో కనువిందు చేసే చిత్రాలు 'విపుల' మరో ప్రత్యేకత.

విశ్వకథా విపంచి



Marketed By
**Margadarsi Marketing** PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004

**విపుల**

132 పేజీలు 125 పైసలే

# వికశించిన బిన్నీ అందాల్లో...
# ఆకర్షణ తొంగి చూస్తుంది.



మనస్సును ఆకట్టుకొనే ప్రింట్లు...
కళ్లు తిప్పుకోలేని డిజైన్లు...
నూలు, 100% పాలియెస్టర్,
పాలియెస్టర్ మేళవింపుల్లో
మృదువైన, మనోహరమైన బట్టలు.
వికశించిన బిన్నీ వినూత్న
ప్రపంచం నిండా రంగులు, డిజైన్లు...
బిన్నీ నుంచి మీరు ఆశించే గట్టిదనం,
నాణ్యతలతో సహా. వికశించిన బిన్నీ
అందాల్లో, మీరూ వికశిస్తారు!

**బిన్నీ**
అందాల ప్రింట్లకు
పెట్టింది పేరు

CASBC-30:79 TL